# ద్రవ బంగారం



నా పేరు పెట్రోలు. డీజిల్ నా అన్నయ్య. మేమిద్దరం కలిసి అద్భుతమైన జంటగా ఉంటాం. మా కడగొట్టు తమ్ముడైన ఎల్‌పిజి కూడా ఇటీవలి కాలంలో గొప్పగా వెలుగొందుతున్నాడు. క్రూడాయిల్ అదే ముడిచమురు మా అమ్మ. ఇవాళ ప్రకృతిసిద్ధంగా లభించే చమురుల్లో ఆవిడే చాలా ఖరీదైనది. అందువల్లే ఆమెకు 'ద్రవ బంగారం' అనే ముద్దు పేరు వచ్చింది. చైనా, ఇండియా దేశాల సత్వర అభివృద్ధి కారణంగా, ఇతర దేశాల నుంచి కూడా మంచి గిరాకీ రావడంతో రోజురోజుకూ మా అమ్మకు గిరాకీ పెరిగి పోతోంది. వనరులు పరిమితం గనక, ఆమె ఖరీదు పైపైకి పెరిగి బ్యారెల్‌కు 118 డాలర్లకు వరకు చేరుకున్నది.

అయినప్పటికీ, ఈ పరిస్థితులను చూస్తుంటే నాకు సంతోషంగా లేదు. వర్ధమాన దేశాలలో ముఖ్యంగా ఇండియాలో పెరుగుతూన్న ధరలు నాకు తీవ్రమైన ఆవేదనను కలిగిస్తున్నాయి. ఎందుకంటే ఇండియా తన ఇంధన అవసరాలకు విదేశాల క్రూడాయిల్ మీద ఆధారపడవలసి ఉన్నది. అయినా, భారత ప్రభుత్వం తీసుకుంటూన్న చర్యలు కాస్త ఊరట కలిగిస్తున్నాయి. మొట్టమొదటిదిగా, ఆదాయం తక్కువగా ఉన్న సాధారణ ప్రజానీకానికి పెట్రోలు సంబంధిత పదార్థాల ధరలపై సబ్సిడీ అందిస్తోంది. రెండవదిగా అధిక ధరల ప్రభావం, వాటి పర్యవసాన పరిరక్షణా చర్యలు సాధారణ ప్రజానీకానికి చేరాలన్న విషయాన్ని ప్రభుత్వం గ్రహించింది. అందువల్ల పెట్రోలియం కన్సర్వేషన్ రీసెర్చ్ అసోసియేషన్ (పిసిఆర్ఎ) అనే సంస్థను ఏర్పాటుచేసి దాని ద్వారా సామాన్య ప్రజలలో పెట్రోలు పదార్థాల పరిరక్షణ ప్రాముఖ్యత గురించీ, ఇంధన సామర్థ్య పెంపుదల గురించీ స్పృహనూ, అవగాహననూ పెంచడానికి కృషిచేస్తున్నది.

పిసిఆర్ఎ నిర్దేశించే సాధారణ చర్యలను ప్రతి ఒక్కరూ అనుసరించాలన్నదే నా సవినయ విన్నపం. గృహిణులు ప్రెషర్ కుక్కర్లూ, వెడల్పాటి పాత్రలూ ఉపయోగించడం ద్వారా గ్యాస్‌ను పొదుపు చేయవచ్చు. మోటార్ కార్ల యజమానులు గంటకు 45-50కి.మీ. వేగంతో నడుపుతూ, కార్-పూలింగ్ పద్ధతిని అనుసరించవచ్చు. సైకిలు మీద వెళ్ళిరావడం, నడవడం లాంటి వాటిని మళ్ళీ ప్రారంభించవచ్చు. ఇవి చాలా స్వల్ప విషయాలుగా అనిపించినప్పటికీ, వీటిని అందరూ అనుసరించడం ద్వారా చాలా మంచి ఫలితాలను రాబట్టవచ్చు.

రాకపోకలకు తమ సొంత వాహనాలకు బదులు ప్రభుత్వ వాహనాలను ఉపయోగించడం వల్ల చాలా వరకు ఇంధన వినియోగం తగ్గుతుంది. నగరాలలో సత్వరరవాణా విధానాలను ప్రవేశపెట్టడం ద్వారా వీటిని సక్రమంగా సాధించవచ్చు. పవన శక్తినీ, సౌరశక్తినీ, ప్రత్యామ్నాయ ఇంధన వనరులుగా ఉపయోగించడం ద్వారా పెట్రోలు పదార్థాల వినియోగాన్ని చాలావరకు తగ్గించవచ్చు. మీరూ ఇలాంటి భావాలనే నాతో పంచుకోగలరని ఆశిస్తున్నాను.







*Chandamama* stories explore our traditions, folk tales, mythology, history and science in an unforgettable narrative style which captures your child's imagination. Generations of children have grown up reading *Chandamama* in their native language. Subscribe today and let your child's quest for knowledge stay alive forever.



I want to subscribe to the following editions of Chandamama: (Tick whatever applies)

☐ **English** ☐ **Language**.................................... ☐ **Junior Chandamama**

**My Name** .................................................... Date of Birth ....................

**Send my issues to**: Mr/Ms.....................................................................

Address ...........................................................................................

.....................................................................................................

.....................................................................................................

City................................ State ................................ Pin ...............................

Telephone........................ Mobile .............................. Email ............................

Enclosed Cheque/DD* for Rupees.........................................................

Cheque/DD no...................................................Favouring **Chandamama India Ltd**

on ................................................................. bank. (Send At-par cheques or add Rs. 60 for non-Chennai cheques) Your subscription will start in 4 weeks.

Please mail the subscribtion form to :

**Chandamama India Limited**, JVL Plaza, 6th Floor, 626 (Old 501) Anna Salai Teynampet, Chennai – 600 018.
Tel: (044) 24334455 Telefax: 24322103 Email: chandamama@chandamama.com Web: www.chandamama.com

*Language/edition for one year is Rs. 180. Only English: Rs. 180 for 1 year. English + any language: Rs. 360 for 1 year. English Chandamama + Junior: Rs. 360 for 1 year. English Chandamama + Junior + any language: Rs. 540 for 1 year.
*Conditions apply.



చందమామ సంపుటి: 61 సెప్టెంబర్ 2008 సంచిక:09

## ఈ నెల విశేషాలు













## ఈ సంచికలో...






వ్యవస్థాపకులు

బి. నాగిరెడ్డి - చక్రపాణి


## అమరవాణి

శీలాన్ని
పోగొట్టుకోవటం
కన్న ఎత్తయిన కొండ
మీది నుంచి
కఠినమైన
ఎగుడుదిగుడు
శిలల మీద పడి
దేహం నాశనం
కావటం మేలు;
వాడికోరలు గల
సర్పరాజు నోటిలో
చెయ్యి పెట్టటం
మేలు;
అగ్నిలో దూకటం
మేలు!



# సరైన పునాదులు

మామూలుగా చిన్న పిల్లలు రోజులో కనీసం ఆరుగంటలసేపు బడిలోనే గడుపుతూ ఉంటారు. మధ్యతరగతి కుటుంబాలకూ, ఉన్నత వర్గాలకూ చెందిన పసిపిల్లలు మోయలేని పుస్తకాలతో పాటు లంచ్ బాక్స్‌లు, వాటర్ బాటిల్స్ తీసుకెళ్ళడం మనకు రోజూ కనిపించే దృశ్యం. అయితే, పేద పిల్లల పరిస్థితి దీనికి పూర్తిగా విరుద్ధమైనది. ఆకలితో నకనకలాడే కడుపులతో బడికి వెళ్ళవలసిన దుస్థితి.

ఈ సమస్యను పరిష్కరించడానికి భారత ప్రభుత్వం మధ్యాహ్న ఉచిత భోజన పథకాన్ని అమలు పరుస్తోంది. ఈ పథకం వల్ల దాదాపు 130,000,000 మంది పిల్లలు లబ్ధి పొందుతున్నారు. ఈ పథకం కారణంగా అర్ధంతరంగా బడి మానేసే పిల్లల సంఖ్య గణనీయంగా తగ్గింది. ఇక్కడ అందించే భోజన పదార్థాల నాణ్యతనూ, కొలతలనూ, శుభ్రతనూ పర్యవేక్షించడానికి అధికారులు ఉన్నారు.

ఇలాంటి పథకాలను అమలు పరచడానికి అక్కడక్కడ కొన్ని ప్రభుత్వేతర స్వచ్ఛంద సేవా సంస్థలు కూడా ముందుకు రావడం ప్రశంసించ తగ్గ విషయం. బెంగళూరులోని అక్షయ పాత్ర ఫౌండేషన్ ఈ విషయంలో మార్గదర్శకమైన సేవను అందిస్తోంది. ఆధునిక సదుపాయాలుగల వంటగదులను ఏర్పాటు చేసి, అక్కడ శుచిగా పోషక విలువలు నిండిన ఆహారాన్ని రుచికరంగా తయారు చేసి బడులకు పంపుతోంది. ఆ కారణంగా పిల్లలు ఆరోగ్యవంతులుగా ఉంటూ చక్కగా చదువుకోగలుగుతున్నారని బెంగళూరు, హుబ్లీ, బారాన్, బృందావన్ ప్రాంతాల నుంచి వచ్చే నివేదికలను బట్టి తెలుస్తోంది.

ఈ రంగంలో ఈ ప్రభుత్వేతర సంస్థ చేస్తున్న సేవలను గుర్తించి; ఇలాంటి నిబద్ధత, చిత్త శుద్ధి గల సంస్థలకు నిధుల మంజూరు చేసి ప్రోత్సహించవలసిన బాధ్యత ప్రభుత్వానికి ఎంతయినా ఉంది. అలా చేసినట్టయితే అర్ధంతరంగా బడి మానేసే దుస్థితి పిల్లలకు ఉండదు. దేశ పురోగతికి సరైన పునాదులు వేసినట్టవుతుంది.

సంపాదకుడు : **విశ్వం**



**Visit us at : http://www.chandamama.com**





చందమామ

***Editor, Publisher :*** B. Viswanatha Reddi (Viswam)
***Chief Executive Officer :*** L. Subramanyan
***Editorial Advisors :*** Ruskin Bond, Manoj Das
***Consultant Editor :*** K. Ramakrishnan
***Associate Editor :*** A.R. Balasubrahmanyam
***Senior Artists:*** K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh
***Artist :*** Jayapandian
***Assistant Editor :*** R. Sudha
***Creative Writer :*** R. Vaasugi
***Layout Designer :*** B.A. Hemalata Malini

***CIRCULATION TEAM :***
***Chennai : T N Ravi Shankar, National Sales Manager***
Mobile +91 99620 70014
email : ravishankar.tn@chandamama.com
**Fazal Khan, *Manager-Circulation & Institutional Sales***
Mobile +91 99625 67860
email : fazal.khan@chandamama.com
***Mumbai : Rajendra K Jadhav, Asst. Manager - Circulation***
Mobile +91 9271720669
**CHANDAMAMA INDIA LTD.,** B-3, Lunic Industry
Opp. State Bank of India, Near Police Station Cross Road
No.6, MIDC Andheri (East), Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
email : rajendra.jadhav@chandamama.com
***New Delhi : Sushil Sharma, Circulation Manager-North***
Mobile +91 98719 30767
**CHANDAMAMA INDIA LTD.,** Goyal Business Centre,
C-23/2 First floor, Connaught Place, New Delhi-110001
***Bangalore : P. Murali, Asst. Circulation Manager -Karnataka***
Mobile +91 94488 36952
**CHANDAMAMA INDIA LTD.,** 18, 10th Cross, Mayura Street
Papanna Lay Out, Outer Ring Road, RMV 2nd Stage
Bangalore-560094, Phone +91 80 6655 1000
email:murali.p@chandamama.com
***Kolkata : Ananth Prakash, Circulation Manager-East***
Mobile +91 98362 82202
email : ananth.prakash@chandamama.com
***Advertisement :*** email : sales@chandamama.com
***Business Dev and Online : Surajit Agarwal***
email : surajit@chandamama.com
***Subscription Queries:*** L Govindasamy
e-mail : govindaswamy.l@chandamama.com
***Customer Cell :*** A B Sairam Mobile: +91 9841983774
e-mail : sairam.ab@chandamama.com
***Head Office : CHANDAMAMA INDIA LTD.,***
JVL Plaza, Block-A, 6th Floor, 626, Anna Salai, Teynampet
CHENNAI-600018, Phone +91 44 2432 2101/02,
Fax +91 44 2432 2103
email : chandamama@chandamama.com
Website : www.chandamama.com

చందా

ఇండియాలో బుక్‌పోస్ట్ ద్వారా రూ.**180.00**

చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారాగానీ, మనిఆర్డర్ ద్వారాగానీ 'చందమామ ఇండియా లిమిటెడ్' పేరిట పంపండి.

# పాఠకుల లేఖలు

## రూ. 250/- బహుమతి పొందిన లేఖ

ఆకర్షణీయ ముఖచిత్రంతో వెలువడిన 'జూలై' సంచిక ఆసాంతం-ఆసక్తికరంగా ఏకబిగిన చదివింప చేసింది. 25 ఏళ్ళనాటి చందమామ కథ 'మనిషికి కావలసినది'-'చేసే వృత్తిమీద గురి, గౌరవంతో సమర్థత పెంచుకోవడం సత్ఫలిత దాయకం' అనే అద్భుత జీవన సూత్రాన్ని ఆవిష్కరించింది. దయాగుణం దొంగలో సైతం సత్పరివర్తనను తేగలదని 'మంచిదొంగ' కథ ప్రబోధిస్తే, పదుగురి మేలుకై ఉపయోగపడే ఏ అనుచితకృత్యమైనా పాపం కాదని 'చిముకుడి సాహసం' బేతాళ కథ నిరూపించింది. ''పాపిష్ఠిజన్మ'' జాతకకథలో సుతనుడు బ్రహ్మరాక్షసిలో మార్పు తెచ్చిన తీరు ఆదర్శ దాయకం. సమస్యలకు చక్కని పరిష్కారాన్ని చూపే చతురతతో 'బీర్బల్ కథలు' ఆకట్టుకుంటున్నాయి. 'చిరస్మరణీయ చారిత్రక ఘట్టాలు' శీర్షికలో సావర్కార్ వీరసాహసం ఎంతో స్ఫూర్తిదాయకం!

పత్రిక విజయానికి పాఠకాదరణయే ప్రధానకారణ మని నిగర్వంగా పేర్కొంటూ, 'పాఠకుల ఆదరణ'ను పదిలపరచుకునే దిశలో, పత్రిక రూపకల్పనలో పాఠకు లను కూడా భాగస్వాములను చేస్తూ, అభిప్రాయాలు అందజేసి సహకరించమని కోరిన 'విశ్వం'గారి 'ఆత్మీయ సంపాదకీయం' అభినందనీయం!

బాలల ఆలోచనాశక్తిని, సృజనాత్మక శక్తిని పెంపొందిం చేందుకు వీలుగా 'బొమ్మకు తగ్గ కథ' ఊహించి వ్రాయ మనే శీర్షిక, అసంపూర్తి కథకు సముచిత 'ముగింపు' నిచ్చేశీర్షికను, ఇంకా 'బాలల స్వగతాలు, జోక్స్' వంటివి పొందుపరచటం అభిలషణీయం!

– మహంకాళి సుధాకరశర్మ,
విద్యానగర్ – **524 413,** నెల్లూరు జిల్లా



# సగం నిజం

పేదరైతు వీరన్న తెలివి, సమయస్ఫూర్తి గురించి వీరాపురంలో అందరూ గొప్పగా చెప్పుకుంటారు. ఒకసారి ఆ ఊళ్ళో హఠాత్తుగా వర్షం కురవడంతో వీరన్న ఇల్లంతా కురవ సాగింది. వెంటనే ఇంటికప్పు మరమ్మతు చేయించే స్తోమతులేదు గనక, తన ఇంట్లోని ముఖ్యమైన పత్రాలను, పిల్లల జాతకాలను గుడ్డలోకట్టి, ఆ మూటను పొరుగునే ఉన్న భూస్వామి సుబ్బయ్యకు దాచమని ఇచ్చాడు.

సుబ్బయ్య ఇంట్లో పెద్ద కావిడి పెట్టెలు రెండు ఉన్నాయి. ముఖ్యమైన పత్రాలూ, వస్తువులూ మొదటి పెట్టెలోనూ; పిల్లల ఆటవస్తువులు రెండో దాంట్లోనూ దాస్తారు. వీరన్న ఇచ్చిన మూటను సుబ్బయ్య మొదటి పెట్టెలో దాచాడు.

కొన్నాళ్ళు గడిచాక వీరన్న కూతురికి పొరుగూరు నుంచి పెళ్ళి సంబంధం వచ్చింది. వరుడి తండ్రి జాతకాలు సరిపోల్చి చూడాలని షరతు పెట్టాడు. ఆలస్యం చేస్తే సంబంధం తప్పిపోతుందన్న భయంతో జాతక పత్రాలున్న మూట తెచ్చుకోవడానికి వీరన్న సుబ్బయ్య ఇంటికి వెళ్ళాడు.

ఆ సమయానికి సుబ్బయ్య ఇంట్లో గొడవగా ఉంది. ఆయన మనవలు ఆటవస్తువు కోసం రెండో కావిడి తెరవబోతే తాళంచెవి కన్నంలో చిక్కుకున్నది. ఎవరెంత ప్రయత్నించినా బయటకురాలేదు.

పెట్టెతాళం తెరిచి బాగుచేయాలంటే వడ్రంగి కావాలి. వడ్రంగి కావాలంటే పొరుగూరు వెళ్ళాలి. కాని సుబ్బయ్య ఇంట్లో వారెవ్వరికీ పొరుగూరు గురించి ఎక్కువ తెలియదు. వీరన్న తానిచ్చిన గుడ్డ మూట కోసం రాగానే సుబ్బయ్య భార్య భర్తను పక్కకు పిలిచి, ''తాళాలు బాగుచేయించేవాళ్ళ గురించి వీరన్నకు బాగా తెలుసు. అతడి మూట ఉన్న పెట్టెతాళం పాడయిందని చెప్పు.

జొన్నలగడ్డ రామలక్ష్మి



అవసరం తనది కాబట్టి తాళం బాగుచేయడానికి ఏదో చేస్తాడు,'' అని ఉపాయం చెప్పింది. సుబ్బయ్య సరేనని వీరన్నతో అలాగే చెప్పాడు.

సమయస్ఫూర్తిగల వీరన్నకు వెంటనే అసలు విషయం అర్థమైపోయింది. అతడు దిగులు నటిస్తూ, ''పొరుగూళ్ళో నాకు మంచి వడ్రంగులు తెలుసు. వాళ్ళ కోసం నేనిప్పుడు పొరుగూరు వెళితే కాబోయే నా వియ్యంకుడు జాతక పత్రాలేవని అడుగుతాడు. అవి తీసుకుని మరోసారి వస్తానంటే నీ కూతురి పెళ్ళికంటే ఇతర పనులే నీకు అంత ముఖ్యమా అని మండిపడ గలడు,'' అన్నాడు.

సుబ్బయ్య అంతా విని, ''ఏం చేస్తాం. అంతా మనమనుకున్నట్టు జరగదు కదా?'' అన్నాడు తాపీగా. వీరన్న ప్రాథేయపడుతున్నట్టుగా, ''నువ్వు జాగ్రత్తపరుడివి. ముఖ్యమైన పత్రాలున్న ఆ మూటను పిల్లల ఆట వస్తువులున్న పెట్టెలో దాస్తావనుకోను. మీ ఇంట్లో ఇంకో కావిడి పెట్టె ఉన్నది కదా. ఒక్కసారి అందులో కూడా చూడు. నా పత్రాల మూట ఉండవచ్చు,'' అన్నాడు.

సుబ్బయ్య ససేమిరా అన్నాడు. వీరన్న కాసేపాలోచించి, ''మనూరికి కొత్తగా వచ్చిన సిద్దప్పకు తాళాలు బాగుచేయడం తెలుసని మా పొరుగింటాయన చెప్పాడు. అతడికి నోటి దురుసెక్కువనీ, ఐతేనేం పని బాగా చేస్తాడనీ అన్నాడాయన. నీకు అభ్యంతరం లేకపోతే వెంటనే అతణ్ణి పిలిపించు,'' అన్నాడు.

సుబ్బయ్య సిద్దప్పకు కబురంపి రప్పించి తాళం సంగతి చెప్పాడు. అంతలో వీరన్న, ''ఒక్కసారి తాళం బాగున్న పెట్టెలో కూడా వెదుకు. అదృష్టం బావుంటే నా మూట అందులో ఉంటుంది,'' అని వేడుకున్నాడు.

అప్పటికి సిద్దప్ప పని ప్రారంభించడంతో తృప్తిపడ్డ సుబ్బయ్య మొదటి కావిడి పెట్టె తెరిచి తెగవెతికినట్టు నటించి, వీరన్న మూటను తీసి అతడికిచ్చి, ''నువ్వన్నట్టే నీ అదృష్టం బావుంది. వెళ్ళి నీ పని చూసుకో,'' అన్నాడు.

వీరన్న వెళ్ళిపోయాక సిద్దప్ప ఇంట్లో వాళ్ళను నానా తిప్పలు పెట్టాడు. కాసేపు సుత్తి కావాలంటాడు. తరవాత రాయి కావాలంటాడు. ఉండుండీ దాహమంటాడు. తెగ విసుక్కుంటాడు. తాళం చెవిని పిల్లల చేతికిచ్చినందుకూ, ఆ తరవాత చేతకాని ప్రయ

త్నాలతో తాళాన్ని వంచినందుకూ అందరినీ తిట్టాడు. కనుచీకటి పడేదాకా అక్కడే ఉండి, ''రోజంతా కష్టపడినా ఫలితం కనబడలేదు. రేపటికి మంచి పదునున్న గొడ్డలిని సిద్ధం చేయండి. పెట్టె బద్దలు కొడతాను,'' అని చెప్పి వెళ్ళాడు.

ఆ తరవాత పొరుగూరి నుంచి మరో మనిషితో కలిసి తిరిగొచ్చిన వీరన్న సుబ్బయ్య ఇంట్లో మిఠాయిలిచ్చి, ''నా పత్రాలను వేరే పెట్టెలో ఉంచడం వల్ల ఈ రోజు నా కూతురికి మంచి సంబంధం కుదిరింది. ఈ ఘనత నీదే,'' అని సుబ్బయ్యను మెచ్చుకున్నాడు.

''నీకు నీ పని బాగానే జరిగింది. నువ్వన్నట్టే ఆ సిద్దప్ప రోజంతా మా ఇంటిల్లి పాదినీ తిట్టిపోశాడు. కానీ, పని మాత్రం బాగా చెయ్యలేదు,'' అన్నాడు సుబ్బయ్య నిష్ఠూరంగా.

వీరన్న జరిగినదానికి నొచ్చుకుని, ''ఎందుకైనా మంచిదని పొరుగూరి నుంచి ఒక మంచి వడ్రంగిని తీసుకొచ్చానులే,'' అంటూ తనతో వచ్చిన మనిషిని చూపించాడు. అతడు లోపలికి వెళ్ళి తన వద్ద ఉన్న పనిముట్లతో క్షణాల మీద తాళం బాగు చేశాక, ''అదృష్టమంటే నీది సుబ్బయ్యా, ఇక నీకు సిద్దప్పతో పనిలేదు,'' అన్నాడు వీరన్న.

''అంటే సిద్దప్ప వల్ల పనిజరగదని నీకు ముందే తెలుసు. అందుకే పొరుగూరి నుంచి ఇతగాణ్ణి వెంటబెట్టుకు వచ్చావు,'' అన్నాడు సుబ్బయ్య.

వీరన్న నవ్వి, ''లేదు సుబ్బయ్యా! నేను సిద్దప్పను తీసుకొచ్చాక నీకు మరో కావిడి పెట్టెలో నా పత్రాలు దొరికాయి కదా? అవి తీసుకుని జ్యోతిష్కుడి కోసం పొరుగూరు వెళుతూంటే గుర్తొచ్చింది. మా పొరుగింటాయన కూడా సగం నిజమే చెబుతాడని. అంటే సిద్దప్పకు నోటి దురుసు, పని బాగా చేస్తాడన్న రెండింటిలో ఏదో ఒకటే నిజమై ఉండొచ్చనిపించి ఎందుకైనా మంచిదని వడ్రంగిని తీసుకువచ్చాను,'' అన్నాడు.

మా పొరుగింటాయన కూడా సగం నిజమే చెబుతాడనడంలోని అంతరార్థం గ్రహించిన సుబ్బయ్య, తన అబద్ధాన్ని వీరన్న పసిగట్టాడని గ్రహించి మరి కిమ్మనలేదు.



# విగ్రహాల నిమజ్జనం - జలకాలుష్యం

మహారాష్ట్ర పుణేలోని లకాకీ లేక్ ఆ రోజు ఉదయం అసాధారణ కార్యకలాపాలతో సందడిగా కనిపించింది. గణేశ విగ్రహాల నిమజ్జనం జరిగే గణేశ ఉత్సవాల చివరిరోజు అది. నగరంలో ప్రవహించే ముల్లా, ముత్తా నదులకేసి వేలాది కుటుంబాలు తరలి వెళతాయి. రాళ్ళక్వారీ పర్యవసానంగా ఏర్పడిన లకాకీ లేక్ గత [illegible]ళ్ళకు పైగా గణేశ విగ్రహాల నిమజ్జనకు ఇష్టమైనస్థలంగా త[illegible]రయింది. యూనిఫారంలో వున్న ముప్పై విద్యార్థులు వృత్తాకారంలో కూర్చుని తమ పథకానికి తుదిమెరుగులు దిద్దుకుంటున్నారు. ఆ సంవత్సరం వాళ్ళ స్కూల్ గ్రీన్ క్లబ్ నాయకురాలైన కమల వాళ్ళకు సూచనలిస్తోంది. గత సమావేశంలో ఫలానా బాధ్యతలు నిర్వహిస్తామని ఒప్పుకున్న విద్యార్థుల జాబితాను చదివింది. ఆరోజు కావలసిన వస్తువులు మూడు పెద్ద సైజు బక్కెట్లు, కొన్ని తుంగ చాపలు, ఒక పెన్నును మరొక జాబితాలో పేర్కొన్నది.

'గ్రీన్ క్లబ్' సభ్యులు వివిధ దిశలలో వెళ్ళిపోయాక కమల చెరువుకేసి చూడసాగింది. చెరువు చివర ఏపుగా పెరిగిన రెల్లుగడ్డి మధ్య వున్న మచ్చల ముక్కు కొంగల గుంపు కనిపించింది. నీళ్ళ గుండా ఎగిరే తెల్ల కడుపు కింగ్ ఫిషర్ పక్షుల వల్ల ఉదయకాల ప్రశాంతతకు అప్పుడప్పుడు అంతరాయం కలుగుతున్నది. ఈ రోజు పిల్లల అడుగుల చప్పుడు, వారి మాటలు పక్షుల శబ్దాన్ని మించి పోతున్నవి.

విద్యార్థులు ఎంత వరకు పర్యావరణానికి స్నేహంగా ఉన్నారన్న దాన్ని గురించి స్కూల్లో



'గ్రీన్ ఆడిట్' జరిగింది. సోమవారం జరిగిన సమావేశంలో తమ అనుభవాలను, తెలుసుకున్న విషయాలను సహవిద్యార్థులతో పంచుకున్నారు. అది తక్షణ కార్యాచరణకు దారి తీసింది. స్కూలు ఆటల మైదానంలో శుభ్రం చేస్తూ సేకరించిన ఆకులనూ, చెత్తాచెదారాన్నీ మగ్గేలా చేయడానికి లోతైన గోతి తవ్వబడింది. మూడు నెలలకోసారి నోటు పుస్తకంలోని ఉపయోగించని కాగితాలను సేకరించి అట్టలు తయారుచేయాలనీ, ఒకసారి ఉపయోగించేసిన కవర్లను వెలుపలికి మడిచి, మళ్ళీ ఉపయోగించాలనీ నిర్ణయించారు.

అన్నిటికన్నా ఉత్తేజం కలిగించే సంచలనాత్మక నిర్ణయం ఒకటి తీసుకున్నారు. 'టెట్రా ప్యాక్స్'లో వచ్చే సాఫ్ట్ డ్రింక్స్‌ను తీసుకోకూడదన్నదే అది. అలాంటి ప్యాకేజీలు వృధా మాత్రమే కాదు; చాలా ఖరీదైనవి. పైగా వాటిలోని అల్యూమినియంపొర కరగదు గనక, పర్యావరణానికి హాని కలిగిస్తుందని తెలియడంతో ఏకగ్రీవంగా ఆ నిర్ణయాన్ని ఆమోదించారు.

''కమలా! కళ్ళు తెరుచుకునే కలలు కంటున్నావా ఏం?'' అని పలకరించింది దర్శిని నవ్వుతూ. ''లేదు, లేదు. సారీ, వస్తున్నా,'' అంటూ అక్కడి నుంచి లేచిన



కమల తటాకం ప్రధాన రేవు వద్దకు వేగంగా బయలుదేరింది. అప్పటికే అక్కడ కొందరు సభ్యులు రెండు చెట్ల కొమ్మల మధ్య 'క్లాత్ బ్యానర్' కడుతున్నారు. ''మన చెరువును కలుషితం చేయకండి... మేమూ జీవించాలి!'' అన్న వాక్యం బ్యానర్‌లో పెద్ద అక్షరాలతో రాయబడింది. ఈ సందేశం చుట్టూ చేపలు, కప్పలు, మరి కొన్ని నీటి పక్షులు, కొంగలు, కింగ్ ఫిషర్ల చిత్రాలు చిత్రించబడ్డాయి.

త్వరలోనే సభ్యుల మధ్య ఏవో గుసగుసలు ఆరంభమయ్యాయి. అందరి దృష్టి ప్రధాన రేవుకు వెళ్ళే దారి మీదికి మళ్ళాయి. కొందరు మనుషులు పాటలు, పద్యాలు పాడుతూ గుంపుగా అటు కేసి నడుస్తున్నారు. నలుగురు మనుషులు గణేశ విగ్రహాన్ని మోసుకుని వస్తున్నారు. కమల దగ్గర నిలబడ్డ శిబానీ, ఆమె చెవిలో, ''ఇదే ఈ రోజు మొదటిది. మనకు చాలా అదృష్టం అనుకుంటాను,'' అన్నది.

ఆ గుంపు ప్రవేశ ద్వారం సమీపించగానే, కమల ముందుకు వెళ్ళి, 'మేము కేంద్రీయ విద్యాలయ గ్రీన్ క్లబ్ సభ్యులం. విగ్రహాలను ఈ చెరువులో నిమజ్జనం చేయకూడదని విజ్ఞప్తి చేయడానికి వచ్చాం,'' అన్నది. ఆ తరవాత సభ్యులందరూ ఒక్కొక్కరుగా తమ తమ అభిప్రాయాలను చెప్పసాగారు:

''విగ్రహాల మీద ఉపయోగించే రంగులన్నీ విషపూరితాలు. అవి నీటిని విషతుల్యం చేస్తాయి,'' అన్నారు ఒకరు.

''ఒకప్పుడు కుటుంబాలన్నీ ఒకటిగా

కలిసి గణేశ పూజను సామూహిక ఉత్సవంగా జరుపుకునేవారు. అది మా తాతల నాటి మాట. ఇప్పుడేమో విడివిడిగా జరుపుకుంటు న్నారు. నిమజ్జనం చేసే విగ్రహాల సంఖ్య పెరిగిపోయింది,'' అన్నారు ఇంకొకరు.

క్లబ్‌లోని అతి పిన్న వయసు లీల, ''ఇవన్నీ కూడా చెరువులోని ప్రాణులకు హాని కలిగిస్తా యని భావిస్తున్నాము,'' అన్నది.

విభిన్న పరిమాణాల విగ్రహాలతో అనేక కుటుంబాలు ఒకదాని వెనక ఒకటి రావడంతో, ఈ దృశ్యం పునరావృత మయింది. చుట్టు పక్కల వారికి చాలా మందికి ఈ చెరువ ఒక్కటే తాగు నీటి ఆధారమనీ; విగ్రహాలకు వేసే రంగులు సీసం, పాదరసం, మాంగనీస్, క్రోమియం మొదలైన లోహ పదార్థాలను నీళ్ళలోకి విడుదల చేస్తాయనీ విద్యార్థులు వారికి వివరిం చారు. విగ్రహాలను సంకే తాత్మకంగా నిమజ్జనం నిర్వ హిస్తే చాలని చెప్పారు. అందుకోసం మూడు బక్కెట్లను నీళ్ళతో నింపారు. విగ్రహాలను అందులో ఒక బక్కెట్ నీళ్ళలో ముంచి పైకెత్తి చెట్ల కింద పరచిన చాపల మీద ఉంచమని వేడుకున్నారు.



క్లబ్ సభ్యుల ప్రయత్నం కొంతవరకు విజయవంతమయింది. ఆ రోజు అక్కడికి వచ్చిన 1 5 2 కుటుంబాలలో 4 3 కుటుం బాలు చెరువులో నిమజ్జనం చేయకుండా ఉండడానికి సమ్మతించాయి. సంకేతాత్మక నిమజ్జనానికి అంగీకరించిన వారి కుటుం బాల పేర్లను, చిరునామాలను లీల ఒక పుస్తకంలో ఉత్సాహంగా రాసుకున్నది.

కమల, లీల ఇళ్ళకు తిరిగి వెళుతున్న ప్పుడు మరి కొందరు విగ్రహాలను నిమజ్జనా నికి తీసుకురావడం చూశారు. కమల గాఢంగా నిట్టూర్చింది. లీల ఆమెకేసి చూస్తూ, ''ఎందుకలా విచారిస్తున్నావు?'' అని అడి గింది. లోకం తీరును తరచూ విమర్శించే తనను, మందలించే చెల్లెన్ని చూసి కమల నవ్వుతూ, ''లేదు లీలా, విచారపడడం లేదు. మనదేశంలో అడవులను నిర్మూలించి ఆక్ర మించేవారు, వేగంగా వెళ్ళే రైళ్ళు మొదలైన కారణాలతో ప్రాణాలు కోల్పోతున్న ఏనుగుల గురించి ఆలోచిస్తున్నాను. మనుషుల భక్తిని మరింత మెరుగైన పనులకు ఉపయోగించ డానికి వీలవుతుందా అని ఆలోచిస్తున్నాను. అంతే,'' అన్నది.

–సుజాతా పద్మనాభన్



# పాతాళదుర్గం

## 2

[కుంతలదేశ మంత్రికొడుకైన శశికాంతుడనేవాడు, ఇద్దరు మిత్రులతో వేటకై అరణ్యానికి వెళ్ళి, సింహాన్ని కొట్టబోయి శత్రుబాణంతో గాయపడ్డాడు. భద్రుడనేవాడు గాయంతో పారిపోయి, రాజధానీ నగరం చేరాడు. కుంతలరాజూ, మంత్రీ అరణ్యంలో ఏం జరిగివుంటుందా అని చర్చిస్తూండగా, సైనికుడొకడు వచ్చి కదంబరాజు దూతలను పంపినట్టు వాళ్ళకు చెప్పాడు. -తరవాత]

కదంబ రాజైన ఉగ్రసేనుడి దూతలు నలుగురు, ఇద్దరు ఖైదీలతో సభామందిరానికి వచ్చారు. శతభానుడు సింహాసనం మీద ఆసీనుడయివున్నాడు. గంగాధరుడు దూతల వెంట వున్న ఖైదీల చేతికట్లు విప్పవలసిందిగా సేవకులను ఆజ్ఞాపించాడు.

రాజసేవకులు ఖైదీల కట్లు విప్పబోయేంతలో ఉగ్రసేనుడి దూతల్లో ఒకడు ముందుకు వచ్చి, గంగాధరుడికి తల వంచి నమస్కరిస్తూ, ''మహామంత్రులు నన్ను క్షమించాలి. వీళ్ళిద్దరూ పరమ క్రూరులు, అతి సాహసులు,'' అంటూ ఖైదీలను సమీపించి, తన చేతికర్రతో ఒకణ్ణి పొడుస్తూ, ''వీడు ధూమకుడు, పితృహంతకుడు. ఈ రెండవవాడు సోమకుడు; భ్రాతృహంతకుడు,'' అన్నాడు.

''ఈ హంతకుల్ని మా వద్దకు పంపడంలో, మీ మహారాజుగారి అభిప్రాయమేమిటి?'' అని ప్రశ్నించాడు మంత్రి గంగాధరుడు.

'చందమామ'



ఆ ప్రశ్న వింటూనే తతిమ్మా ముగ్గురు దూతలూ ముందుకు వచ్చారు. అప్పుడు మొదట మాట్లాడిన దూత, శతభానుడి కేసి తల ఎత్తి చూసి, ''మహారాజులూ, మహామాత్యులకు, మా ప్రభువులు ఉగ్రసేన మహారాజులుంగారు గౌరవపూర్వకంగా నమస్కారాలు చేసి, దుఃఖకరమైన వార్త ఒకటి ఇలా విన్నవిస్తున్నారు: కదంబరాజ్యంలో ఏ కారణం వల్లనో ప్రవేశించిన కుంతలదేశ మహామంత్రుల పుత్రుడూ, వారి అనుచరులిద్దరూ, ఖైదు నుంచి పారిపోయిన ధూమకుడూ, సోమకుడూ అనే హంతకుల వల్ల గొప్ప ఇక్కట్ల పాలయ్యారు. ఆ ముగ్గుర్నీ ఈ హంతకులు చంపి, వారి నగలూ, గుర్రాలూ దొంగలించ బోయేంతలో, ఒకసింహాలమంద అక్కడికి వచ్చి పడింది. ఈ హంతకులు ఆ ప్రదేశం నుంచి పారిపోతూ కాపలాసైనికులకు దొరికారు. మహామంత్రుల పుత్ర మిత్రుల శవాల కోసం, సైనికులు కొండ ప్రాంతమంతా గాలిస్తున్నారు. దొరికితే, ఆ సంగతి వెంటనే తెలియబరచ బడుతుంది,'' అని చెప్పాడు.

''మీ మహారాజుగారు ఇదంతా నోటి మాటగా చెప్పమన్నారా? లిఖిత పత్రం ఏమీ లేదా?'' అన్నాడు గంగాధరుడు.

''మహారాజుగారు ఈ దారుణ విషయం రాయ ప్రయత్నించారు గాని, వారికి చేయి ఆడలేదు. ఆ కారణంగా, వారు రాయ దలచుకున్న విషయం నాకు చెప్పి తమకు తెలియబరచమన్నారు,'' అన్నాడు దూత.

అంతవరకూ కదంబ రాజదూత చెపుతున్నదంతా శ్రద్ధగా ఆలకించిన శతభానుడు సింహాసనం మీది నుంచి లేస్తూ, ''సరే, ఇక మీరు వెళ్ళిపోవచ్చు. ఈ హంతకుల్ని విచారించి తగినశిక్ష మేమే విధిస్తాం,'' అన్నాడు.

ఆ మాటలు వింటూనే ఉగ్రసేనుడి దూతలు కలవరపడిపోయి, ఒకళ్ళ ముఖాల కేసి ఒకరు చూసుకున్నారు. ఈసారి దూతల్లో మరొకడు ముందుకు వచ్చి, ''మహారాజా! క్షమించాలి. పితృ భ్రాతృ హంతకులైన వాళ్ళిద్దరికీ లోగడే యావజ్జీవ కారాగార శిక్ష విధించబడింది. వీళ్ళు ఖైదు నుంచి పారిపోయి, తిరిగి ఈ కొత్త హత్యలకు ఒడిగట్టారు. మా మహారాజుగారి ఆజ్ఞ ఏమిటంటే, ఈ హంతకు లిద్దర్నీ, కదంబ కుంతల దేశాల సరిహద్దు మీదవున్న మహావృక్షానికి దేనికైనా వేలాడకట్టి ఉరిదీయమని. ఆ

కార్యం మేము తిరిగివెళ్ళేటప్పుడు పూర్తి చేస్తాం, ఇక సెలవు!'' అన్నాడు.

ఉగ్రసేనుడి దూతలు నలుగురూ, ఖైదీలిద్దర్నీ సమీపించి, వాళ్ళను చేతి కర్రలతో పొడిచి వెనక్కు తిప్పబోయారు. ఖైదీల్లో ధూమకుడనేవాడు రోషంగా కళ్ళెర్రచేసి, ''ఛీ, దుర్మార్గుల్లారా!'' అంటూ ఈసడించాడు. సోమకుడు కర్రదెబ్బ తిని ఉలకలేదు, పలకలేదు. దూతల్లో ఒకడు వాళ్ళిద్దరికీ చేరువగా వెళ్ళి, ''జాగ్రత్త! మీ పెళ్ళాంబిడ్డల మాట మరిచిపోకండి!'' అన్నాడు పళ్ళు కొరుకుతూ.

దూతలు ఖైదీలతో సభామందిరం నుంచి బయటికి వెళ్ళిపోయారు. రాజు శతభానుడు వాళ్ళు పోయిన ద్వారం కేసి సాలోచనగా చూస్తూ, ''అమాత్యా! హంతకుడు ఉగ్రసేనుడేనన్న అనుమానం నాకు దృఢపడుతున్నది. ఏమిటీ, అతడి ఈ కపట నాటకమంతా!'' అన్నాడు.

''ఈ కపట నాటకం చాటున, మహా భయంకరమైన కుట్ర ఏదో వున్నదన్న అనుమానం నాకు కలుగుతున్నది, మహారాజా! అంతే కాదు. శశికాంతుడు సజీవుడే అని కూడా నేను భావిస్తున్నాను,'' అన్నాడు మంత్రి గంగాధరుడు.

''శశికాంతుడు క్షేమంగా తిరిగి రావాలని నేను కోరుకుంటున్నాను. ఉగ్రసేనుడికి, మన భద్రుడు గాయపడి నగరం చేరినట్టు తెలియదులావుంది. అతడి దూతల మాటల వల్ల మనవాళ్ళు ముగ్గురూ అరణ్యంలో మరణించారని వాళ్ళు అభిప్రాయపడుతున్నట్టు కనబడుతున్నది,'' అన్నాడు శతభానుడు.



''అతడి దూతలు మన నగరం చేరక ముందు, అందరూ అలాగే అనుకుని వుంటారు. ఇప్పుడు నగరప్రజలు చెప్పుకునే మాటల వల్ల, భద్రుడు ఇక్కడికి చేరినట్టు దూతలు గ్రహిస్తారు. వెన్నులో తగిలిన బాణం శస్త్రం చేసి బయిటికి లాగగానే, అతడు మరణించాడని, పుకారు వేయిస్తాను,'' అన్నాడు గంగాధరుడు.

''ఇందువల్ల కలిగే మేలేమిటి?'' అన్నాడు శతభానుడు.

''ఈ పుకారు, అతడి దూతల ద్వారా గాని, మరొకవిధంగా గాని ఉగ్రసేనుడికి చేరుతుంది. ఆ విధంగా, అరణ్యంలో జరిగిన వాస్తవం ఏమిటో మనకు తెలిసే అవకాశం లేదని, అతడు ధీమాగా వుంటాడు. అది మనకు చాలా మేలు చేకూరుస్తుంది. ఈ




హంతకులనబడే ఖైదీలిద్దరి సంగతీ తెలుసుకోవాలి. అదంతా నేను చూస్తాను. తమరు శయనాగారానికి వెళ్ళండి,'' అంటూ మంత్రి గంగాధరుడు రాజుకు నమస్కరించి, సభామందిరాన్నుంచి బయిటికి వచ్చి, అక్కడ కాపలా వున్న ఒక భటుణ్ణి పిలిచి, వాళ్ళ నాయకుణ్ణి తీసుకు రావలసిందిగా ఆజ్ఞాపించాడు.

ఉగ్రసేనుడి దూతలు రాజప్రాసాదపు ఆవరణ దాటి, నగరంలో ప్రవేశించారు. రాజ వీధిన వున్న ఒక చెట్టుకింద నాలుగు గుర్రాలు కట్టివేయబడి వున్నవి. దూతలు వాటిని అధిరోహించి, ఖైదీలైన ధూమక సోమకుల నడుముకు పొడవాటి తాళ్ళుకట్టి, వాటి కొసలను గుర్రాల జీనులకు బిగించి బయలు దేరారు.

ఆ సరికి రాత్రి బాగా పొద్దుపోయింది. నగరం సద్దు మణిగింది. ఏవో అవసర కార్యాల మీద పోయే ఒకరిద్దరు పౌరులూ, గస్తీ భటులూ తప్ప, దూతలకు ఎవరూ దారిలో ఎదురుపడలేదు. వాళ్ళకు భద్రుడు బతికి వున్నాడా, లేక మరణించాడా అన్న సంగతి తెలుసుకోవాలని చాలా ఆదుర్దాగా వున్నది. తాము కదంబరాజు దగ్గిర నుంచి బయలు దేరేటప్పుడు, బాణందెబ్బ తిని గాయపడిన వాడు, అరణ్యంలో ఎక్కడో గుర్రంమీంచి జారి కిందపడి మరణించి వుంటాడని భావించారు. కాని, కుంతల నగరం చేరిన తరవాత నగరపౌరులు మాట్లాడుకునే దాన్ని బట్టి, ఆ గాయపడ్డ వాడు రాజప్రాసాదం చేరాడు. వాడు మాట్లాడే స్థితిలో వుంటే, యధార్థం బయట సడిపోతుంది.

దూతలు నగరద్వారం చేరి, అక్కడ కాపలా వాళ్ళకు నగరరక్షకుడిచ్చిన అనుమతి పత్రం చూపి, ''పాపం, మంత్రి కుమారుడి స్నేహితుడొకడు గాయపడి నగరం చేరాడట. వెన్నులో గుచ్చుకున్న బాణంతో, అతడింత దూరం గుర్రం మీద రావటం ఆశ్చర్యంగా వుంది!'' అన్నారు.

''ఆ గాయపడ్డ యువకుడి పేరు భద్రుడు, ఉక్కు ముక్కలా వుండేవాడు. ఏం లాభం! శస్త్రం చేసి బాణం బయిటికి లాగగానే, ఆ వున్న కాస్త కొనవూపిరీ పోయింది,'' అన్నారు కాపలాభటులు.

''అయ్యో పాపం!'' అంటూ దూతలు లేని జాలి కనబరిచి, నగరద్వారం దాటి అరణ్య మార్గం పట్టారు. ''మన మహారాజా, మంత్రీ పథకం వేశారంటే దానికి తిరుగుండదు,'' అన్నాడొక దూత.

‘‘చచ్చిన వాళ్ళు చచ్చారు; పథకాలూ, తంత్రాలూ అల్లేవాళ్ళు అల్లుతున్నారు. వాళ్ళ మాటకేం గాని, మధ్య మనం అదృష్టవంతులం,’’ అన్నాడు మరొక దూత.

‘‘ఏమిటబ్బా, అంత అదృష్టం?’’ అన్నాడు మొదటి దూత.

‘‘మనం వచ్చిన పని మహచక్కగా, మహా చాకచక్యంగా నిర్వహించాం. మన వాగ్జాలంతో ఈ దేశపు రాజునూ, మంత్రినీ సమ్మోహితుల్ని చేశాం. ఇందుకు మన రాజుగారు మనను ఎంతగా సత్కరిస్తారో, ఎన్నెన్ని మడిమాన్యాలిస్తారో వూహించుకో,’’ అంటూ దూత పెద్దగా నవ్వాడు.

అతడి నవ్వు ముగిసేలోపల అంతకంటె పెద్దగా వికృతంగా దారిపక్క చెట్ల చాటు నుంచి మరొక నవ్వు వినిపించింది. దూతలు ముగ్గురూ నివ్వెరపోయి, ఆ ధ్వని వచ్చిన వైపుకు చూశారు. అక్కడెవరూ వారికి కనిపించ లేదు, అలికిడైన జాడ కూడా లేదు. గుడ్డి వెన్నెలలో అరణ్యం మహా భయంకరంగా వున్నది. ఏవేవో వింత ధ్వనులు వినిపిస్తున్నాయి.

‘‘మన సంతోషంలో మనం ఇంత వరకూ పరిసరాలను గమనించ లేదు సుమా! ఈ అరణ్యం దొంగలకూ, దారిదోపిడీ గాళ్ళకే గాక, మనుషులను పీక్కుతినే అతిభయంకరమైన పిశాచాలక్కూడా నిలయం అని విన్నాం. ఇక నోళ్ళు మూసుకుని జాగ్రత్తగా గుర్రాలను నడపండి. ధూమక సోమకులు గుర్రాల వెంట వస్తూనేవున్నారా?’’ అంటూ దూతల్లో ఒకడు వెనక్కు తిరిగి చూశాడు.



ఆ మరుక్షణం దూతల మీద చెట్లకొమ్మల నుంచి కణకణలాడే బొగ్గులు వానజల్లులా కురిసినై. ఆ నిప్పుకణాలు మీద పడగానే గుర్రాలు బెదిరి పరిగెత్తసాగినై. దూతల్లో ఇద్దరి దుస్తులు నిప్పంటుకుని భగ్గుమన్నవి.

‘‘కొరివిదయ్యాలు! కొరివిదయ్యాలు!’’ అంటూ దూతలు నలుగురూ ఒక్కసారిగా భీతిలో కేకలు పెట్టారు. కళ్ళాలు లాగి, పరిగెత్తే గుర్రాలను ఆపాలనే ప్రయత్నం వాళ్ళేమీ చెయ్యలేదు. అవి పెద్దగా సకిలిస్తూ దారీతెన్నూ లేకుండా అరణ్యానికి అడ్డంపడి పరిగెత్తసాగినై. ధూమక సోమకులు పడుతూ లేస్తూ, వాటి వెనక పరిగెత్తసాగారు.

కొద్ది సేపటి తరవాత గుర్రాలు అలిసిపోయి రౌతుల స్వాధీనానికి వచ్చినై. దూతల్లో ఒకడు ధూమక సోమకులు తమ వెంటనే వుండటం గమనించి తృప్తిగా నిట్టూర్చి, ‘‘మనం

ఎంత అదృష్టవంతులం! ఎంత పెద్ద ప్రమాదా న్నుంచి బయటపడ్డాం. కొరివిదయ్యం పట్టు నుంచి బయటపడ్డ వాణ్ణి, కాలుడు కూడా ఏమీ చెయ్యలేడని సామెత గదా!'' అన్నాడు.

''ఆ సామెతలకేం లే, మనం దారి తప్పాం,'' అన్నాడొక దూత విసుగ్గా.

''దారి తప్పితేనేం, ప్రాణాలు దక్కినై. ఆ కనబడే కొండ మన రాజ్యంలోదే కదా?'' అన్నాడు మరొక దూత.

''అవును, మీ రాజ్యంలోదే! మీరు కదంబ రాజుగారి దూతలా? మంచిది, నా వెంట రండి. నేను కుంతలదేశ సరిహద్దు కాపలా సైనికుణ్ణి. కుంతల, కదంబదేశాల సరిహద్దు మీద వున్నదే, ఆ కనబడే మహావృక్షం! మీరు దానికింద నిలబడి చూస్తే, పోవలసిన దారి సూటిగా కనబడుతుంది,'' అని చెప్పాడు సైనికుడొకడు.

సైనికుడు ముందుండి దారితీయగా, దూతలు ఎక్కడలేని సంతోషంతో తమ గుర్రాలను వెనకగా నడిపి అతడు చెప్పిన మహావృక్షం కిందికి వెళ్ళారు. అక్కడ మరొక కాపలాసైనికుడు కత్తి చేతబట్టుకుని నిలబడి వున్నాడు.

''అక్కడ తెల్లగా పాములా మెలికలు తిరుగుతూ పోతున్నదేమిటి? కొండవాగా?'' అని అడిగాడు ఒక దూత. కాపలా సైనికుడు ఆ ప్రశ్నకు జవాబిచ్చేంతలో, చెట్టుకొమ్మల్లో ఏదో శబ్దం అయింది. దూతలు భయంతో కంపించిపోతూ, తలలు ఎత్తి, ''ఏవో కొండ చిలువలలా వున్నై!'' అంటూ గుర్రాలను అదిలించారు. అంతలో బలమైన రెండు ఉచ్చుతాళ్ళు విసురుగా వచ్చి, దూతల్లో ఇద్దరి కంఠాలకు బిగుసుకున్నై. వాళ్ళెక్కి వున్న గుర్రాలు రెండూ ముందుకు పరిగెత్తినై. కత్తి చేతబట్టుకుని వున్న కాపలా సైనికుడు ధూమక సోమకుల నడుముకు బిగించి వున్న తాళ్ళను ఒక్క వేటుతో నరికివేశాడు.

మిగిలిన ఇద్దరు దూతలూ భీతితో అరుస్తూ, గుర్రాలను అదిలించి కొండవాగు కేసి దౌడు తీశారు. కంఠాలకు ఉచ్చులు బిగుసుకున్న దూతలిద్దరూ ఒక్కసారి కీచుమంటూ అరిచి, కొమ్మలకు వేళ్ళాడసాగారు.

''ఆ పారిపోయే ఇద్దర్నీ వాగు చేరకముందే పడగొట్టండి!'' అన్న కేక వినిపించింది. ఆ వెంటనే చెట్లచాటు నుంచి బయటికి వచ్చిన కుంతలసైనికులు, దూతల కేసి బాణాలు వదలసాగారు. -(ఇంకావుంది)





# చిరునాధుడి వితరణ!

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, మునుముందు ఎలాగో గాని ఇప్పటి వరకు నీ స్థిరచిత్తం గురించి నాకు ఎలాంటి అనుమానమూ లేదు. కాని మొదట ఏదో సాధించాలనుకునే కొందరు తీరా సాధించాక ఎలాంటి కారణం లేకుండానే దానిని చేజార్చుకుంటూ ఉంటారు. చిరునాధుడనే యువకుడు వెతుక్కుంటూ వచ్చిన అవకాశాన్ని శ్రమపడి సద్వినియోగం చేసుకుని అద్భుత నిధిని సాధించి ఆఖరికి దానిని పరుల పాలు చేయడానికి సంసిద్ధుడయ్యాడు. నీకు తగు హెచ్చరికగా

బేతాళ కథలు



ఉండేందుకు అతడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్ప సాగాడు:

సిరిపల్లెలో చిరునాథుడనే ఒక యువ కుడుండేవాడు. ఒకనాడు ఆ ఊరొచ్చిన ఒక బైరాగి అతడి చేయిని చూసి, ''అదృష్టం నిన్ను వెతుక్కుని వస్తుంది,'' అని చెప్ప డంతో, ఆ క్షణం నుంచి పనీ పాటుకు పోకుండా తనకు పట్టబోయే అదృష్టం గురించి కలలు గనసాగాడు చిరునాథుడు. అలా ఒకనాటి మధ్యాహ్నం వేళ అతడు గ్రామం పొలిమేర లోని రావిచెట్టు కింద కూర్చుని ఉండగా ఒక యువకుడు వచ్చి, ''అయిదేళ్ళ పాటు, నేను చెప్పిన ఇంట నా తరఫున పనులు చేయడానికి సమ్మతించావంటే, తరతరాలకు తరగని నిధి నీ వశమవుతుంది,'' అన్నాడు.

చిరునాథుడు అతడి కేసి ఆశ్చర్యంగా చూశాడు. అప్పుడా వ్యక్తి తనను గురించి ఇలా చెప్పాడు:

శ్రీపురానికి చెందిన ఆ యువకుడి పేరు ఆనందుడు. అతడొక యువతిని ఇష్టపడి పెళ్ళి చేసుకుందామని ఆమె తండ్రిని అడి గితే ఆయన వెయ్యి వరహాలు కన్యాశుల్కం అడిగాడు. అంత డబ్బు తన వద్ద లేక ఆనం దుడు ఆ ఊళ్ళో చాలా మందిని అప్పడి గాడు. పేదవాడైన అతడికి ఎక్కడా చిల్లిగవ్వ అప్పు పుట్టలేదు. ఆఖరికి శకారుడనే వాడు తన ఇంట ఐదేళ్ళు పని చేస్తే అప్పిస్తానన్నాడు. ఆనందుడు ఆ ఇంట్లో పనికి కుదిరిన కొన్నా ళ్ళకే ఏదో వింత జబ్బు చేసి అతడి ముఖం వికారంగా తయారయింది. పెళ్ళాడదామను కున్న యువతి అతణ్ణి ఏవగించుకుని మరొ కణ్ణి పెళ్ళాడింది. దాంతో ఆనందుడికి జీవితం మీద విరక్తి పుట్టి దేశాటనకు బయలుదే రాడు.

పని మానేసి పోతానన్న ఆనందుడితో శకా రుడు, ''అప్పడిగావు. ఇస్తానన్నాను. డబ్బు తీసుకోవడం, తీసుకోకపోవడం నీ ఇష్టం. అయితే, అన్న మాట ప్రకారం నా ఇంట్లో పని చెయ్. లేకపోతే మాట తప్పిన పాపం వెంటాడి, జీవితంలో ఏం చేసినా నీకు అచ్చిరాదు,'' అని బెదిరించాడు.

తిరిగి వచ్చినప్పుడు ఎలాగైనా మాట నిలుపు కుంటాను అని చెప్పి ఆనందుడు అక్కడి నుంచి బయలుదేరాడు. అతడు కొన్నాళ్ళకు బృహదారణ్యం చేరుకుని తపోసంపన్నుడైన



ప్రకాండుడికి పరిచర్యలు చేస్తూ గడిపి, సమయం చూసి తన పరిస్థితిని వివరించి తనకు సన్యాసం ఇప్పించమని వేడుకున్నాడు.

''నీ విరక్తి తాత్కాలికం. సన్యసించడం అంత తేలిక కాదు. ప్రస్తుతానికి ఘనమంత్రం ఉపదేశిస్తాను. దాన్ని జపిస్తూ తపస్సు చేశావంటే నీకొక రహస్యనిధి గోచరిస్తుంది. దాన్ని యేడాది పాటు సంరక్షిస్తూ నీ తపోదీక్ష కొనసాగించావంటే నీకు కలిగే అద్భుత శక్తులను పయోగించి నీకు కావలసినవి పొందవచ్చు. అప్పటికీ విరక్తిభావం పోలేదంటే సన్యాసం స్వీకరించవచ్చు. అయితే, యేడాదిలోగా తొందరపడి నీ శక్తులను ఉపయోగించావో అనర్థం తప్పదు,'' అని చెప్పి ప్రకాండుడ తనికి ఘనమంత్రం ఉపదేశించాడు.

ఆనందుడు ఆశ్రమం నిర్మించుకుని ఘన మంత్రం జపిస్తూ తపస్సు ప్రారంభించాడు. కొన్నాళ్ళకతనికి దగ్గరిలోని మర్రిచెట్టు తొర్రలో నిక్షిప్తమైన గొప్ప నిధి ఒకటి గోచరించింది. సరిగ్గా ఆ సమయంలోనే నీలాంబరి అనే యువతి అక్కడికి వచ్చింది.

నీలాంబరి పేద కుటుంబంలో పుట్టింది. భోగభాగ్యాలపై మోజుపడే ఆమెను సుబోధుడనే పేదవాడు ఇష్టపడి కానీ కట్నం లేకుండా పెళ్ళిచేసుకుంటానన్నాడు. అందుకామె తండ్రి సరేననడంతో నీలాంబరి ఇల్లొదిలి పారిపోయి, అనుకోకుండా ఆనందుడి ఆశ్రమం సమీపించింది. ఆమె కథ విన్న ఆనందుడు, ఆమెకు నిధిని గురించి చెప్పి, ''యేడాది పాటు నిధిని కాపలా కాస్తూ నాకు సపర్యలు చేస్తే ఆ నిధి నీదే. నా తపోదీక్ష పూర్తికాగానే ఆ నిధి తీసుకుని నీకిష్టమైనవాణ్ణి పెళ్ళాడవచ్చు,'' అన్నాడు.

నీలాంబరి సరేనని అక్కడే ఉండిపోయింది.

ఒకనాడు ఆనందుడు స్నానం కోసం సెలయేటికి వెళ్ళిన సమయంలో ఆమెను వెతుక్కుంటూ సుబోధుడక్కడికి వచ్చాడు. ఒంటరిగా ఉన్న నీలాంబరి అతడికి జరిగింది చెప్పి, ''నిధికోసం యేడాది ఆగలేను. నువ్వు ఆనందుణ్ణి చంపెయ్. నిధిని తీసుకుని ఊరెళ్ళి హాయిగా జీవిద్దాం,'' అన్నది.

అప్పటికి స్నానం ముగించి తిరిగివచ్చి ఆనందుడామె మాటలు విని కోపం పట్టలేక, ''నిధినిచ్చానన్న కృతజ్ఞత కూడా లేకుండా నన్ను చంపాలనుకున్న నువ్వు బ్రహ్మరాక్షసివైపో,'' అని శపించాడు.



ఊహించని ఈ శాపానికి నోట మాటరాక నిశ్చేష్టురాలయింది నీలాంబరి.

అంతలో ప్రకాండుడు అక్కడికి వచ్చి, ఆనందుడితో, ''నియమం తప్పి, యేడాది లోగా తపోశక్తిను పయోగించి కష్టపడి సాధించిన శక్తులన్నిటినీ తొందరపడి పోగొట్టుకున్నావు. నీలాంబరికి శాపవిమోచనమయ్యాకనే ఆ శక్తులు నీకు తిరిగి వస్తాయి. కానీ, ఆమెకు శాపవిమోచనం కలిగించడం నీవల్ల కాదు,'' అన్నాడు.

''నీలాంబరి ప్రవర్తనతో మళ్ళీ నాకు జీవితంపై విరక్తి కలుగుతున్నది. సన్యాసం ఇప్పించండి,'' అన్నాడు ఆనందుడు దీనంగా.

''నువ్వు శకారుడికి మాటిచ్చి రుణపడ్డావు. ఆ రుణం తీరేదాకా సన్యసించే అర్హత నీకు లేదు,'' అన్నాడు ప్రకాండుడు.

''తమరేనాకు తరుణోపాయం చెప్పాలి,'' అంటూ ఆనందుడు ప్రకాండుడి పాదాలపై బడ్డాడు.

''నీలాంబరి బ్రహ్మరాక్షసిగా మారి ఈ మర్రి చెట్టును ఆవహించి నిధిని కాపలా కాస్తూ ఉంటుంది. నువ్వు శకారుడి రుణ విముక్తి పొంది, అర్హుడికి నిధిని అప్పగించాకనే ఆమెకు శాపవిముక్తి,'' అన్నాడు ప్రకాండుడు.

''అదెలాగో చెబితే చేస్తాను,'' అన్నాడు ఆనందుడు.

''ధనాశతో కృతజ్ఞతను మరిచిన నీలాంబరికి, కృతజ్ఞతతో ధనాశను వీడిన వాడి వల్లే శాపవిముక్తి లభిస్తుంది. సిరిపల్లెలోని చిరునాధుడు అలాంటి వాడు కాగలడని నాకు తోస్తున్నది. ప్రయత్నించి చూడు,'' అంటూ అతడికి చిరునాధుడి వివరాలు చెప్పి ప్రకాండుడు వెళ్ళిపోయాడు.

చిరునాధుణ్ణి వెతుక్కుంటూ ఆనందుడు సిరిపల్లె చేరాడు.

ఇంతవరకు ఆనందుడి నుంచి విన్న చిరునాధుడు నిధి మీది ఆశకొద్దీ, ''ఎవరి ఇంట పనిచేయాలి?'' అని అడిగాడు.

''శ్రీపురం శకారుడి ఇంట్లో. పని పూర్తి చేసుకుని బృహదారణ్యానికి రా,'' అని చెప్పి ఆనందుడు తపస్సు చేసుకోవడానికి వెళ్ళిపోయాడు.

చిరునాధుడు శ్రీపురం వెళ్ళి, ఆనందుడు పంపగా వచ్చానని చెప్పి శకారుడి ఇంట పనిలో చేరాడు. శకారుడి భార్య అడ్డమైన

పనులు పురమాయించసాగింది. చిరునాధుడు తనది కాబోయే నిధి మీది ఆశతో ఓర్పుగా పనులన్నీ చేయసాగాడు.

ఒకనాడు శకారుడి భార్య, ''నువ్వు చేసే వంట నోట్లో పెట్టలేక పోతున్నాం. ఈ ఊళ్ళో చిరుమతి అనే పనిపిల్ల చక్కగా వంట చేస్తుంది. దానికి మహాగర్వం. మా ఇంట్లో పని చేయమంటే చేయనన్నది. దాన్ని మా ఇంట్లో పనికి కుదిర్చావా సరేసరి. లేదా నిన్ను పనికి పెట్టుకోలేదని వెళ్ళి ఆనందుడికి చెప్పు,'' అన్నది చిరునాధుడితో.

చిరునాధుడు చిరుమతిని కలుసుకుని, తన పరిస్థితి వివరించాడు. ఆమె నవ్వి, ''ఎప్పుడో అదృష్టమొస్తుందని ఇప్పుడే దురదృష్టం కొనితెచ్చుకున్న నీమీద జాలి పడగలనుగాని, నీకు సాయపడలేను,'' అన్నది.

''నేను ఐదేళ్ళు పని చేస్తే గొప్పనిధి నా సొంతమవుతుంది. గొప్పవాణ్ణయ్యాక నీ రుణం తీర్చుకుంటాను. నా మాట కాదనకు,'' అని ఆనందుడు ప్రాధేయపడ్డాడు.

చిరుమతి మెత్తబడి, ''రుణం గురించి మాట్లాడకు. నాకోసం కష్ట పడడం నాకలవాటే. ఇప్పుడు నీ కోసం కష్టపడతాను,'' అని చెప్పి శకారుడింట్లో వంటపనికి చేరింది.

ఐదేళ్ళు ఇట్టే గడిచి పోయాయి. చిరునాధుడు బృహదారణ్యం వెళ్ళి ఆనందుణ్ణి కలుసుకుని, ''నీకిచ్చిన మాట ప్రకారం శకారుడి ఇంట్లో అయిదేళ్ళు పనిచేశాను. అతడికి నీ రుణం తీరిపోయిందనుకుంటాను. అయితే, నాకిప్పుడు నిధివద్దు. నీకిష్టమైన వారికి ఇచ్చుకో. నా కోసం నాతోపాటు కష్టపడ్డ చిరుమతిని పెళ్ళాడాలనిపిస్తోంది. అయితే,



నీలాంబరి శాపవిమోచనం కోసం కృతజ్ఞతకు కట్టుబడాలని నియమం ఉందిగనక, నువ్వు చెప్పినట్టు చేయడానికి సిద్ధంగా ఉన్నాను,'' అన్నాడు.

అతడలా అంటూండగానే నీలాంబరికి శాపవిమోచనమయింది. అప్పుడే అక్కడికి వచ్చిన ప్రకాండుడు చిరునాధుడి మాటలకు పరమానందం చెంది అతడి శిరస్సును తాకి దీవించాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, అదృష్టం కోసమే కాచుకుని, ఆ తరవాత ఐదేళ్ళు కష్టపడ్డ చిరునాధుడు అందుకోబోయే క్షణా లలో నిధిని ఎందుకు వద్దన్నాడు? ఎవరి ప్రమేయమూ లేకుండా నీలాంబరికి ఎలా శాపవిమోచనమయింది? చిరునాధుణ్ణి ప్రకాండుడు ఆనందంతో ఆశీర్వదించడానికి గల కారణం ఏమిటి? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీతల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''ఐదేళ్ళ కాయ కష్టంతో శ్రమజీవనంలోని మాధుర్యం తెలిసి రావడంతో చిరునాధుడికి అదృష్టం పట్ల ఆసక్తి, నిధి పట్ల వ్యామోహం అడుగంటిపోయాయి. ప్రతిఫల మాశించి చేసేసాయం వ్యాపారమని పించుకుంటుందే తప్ప, సాయమనిపించు కోదు. ప్రతిఫలాపేక్ష లేకుండా, మానవ త్వంతో, ఆత్మీయతాభావంతో చిరువుతి చిరునాధుడికి సాయపడింది. ఆమె అతడి డబ్బును ఆశించలేదు. ఆమె సాహచర్యం వల్లనే చిరునాధుడు ధనాశను కూడా జయించ గలిగాడు. అలాంటి వ్యక్తిని పెళ్ళాడాలన్న నిర్ణయంతో చిరునాధుడు అక్కడికి రావడం వల్లే నీలాంబరికి శాప విమోచనమయింది. వ్యాపారమయమై పోతూన్న మానవ సంబం ధాలలో అరుదుగా కనిపించే విశిష్ట వితరణ అది. అలాంటి గొప్ప నిర్ణయం తీసుకోవడం వల్లే ప్రకాండుడతణ్ణి ఆనందంతో దీవిం చాడు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం : ''వసుంధర'' రచన]



## స్వర్ణపతకం సాధించిన అభినవ్ బింద్రా



**112** ఏళ్ళ ఒలింపిక్స్ చరిత్రలో మొట్టమొదటి సారిగా భారత దేశం వ్యక్తిగత స్వర్ణపతకాన్ని సాధించింది. ఈ ఘనత సాధించిన ధీరుడు చండీఘడ్‌కు చెందిన ఇరవైఐదేళ్ళ అభినవ్ బింద్రా; పురుషుల 10 మీటర్ల ఎయిర్ రైఫిల్ విభాగంలో స్వర్ణపతకం సాధించి చరిత్ర సృష్టించాడు. తొలి సువర్ణ పతకం సాధించి భారతదేశ కీర్తిపతాకను ఎగురవేసిన అభినవ్ బింద్రాకు వందకోట్ల భారతీయ ప్రజానీకంతో కలిసి 'చందమామ' హృదయ పూర్వక అభినందనలు తెలియజేస్తోంది.




## అంతస్థులపైకి వెళ్ళడంలో రికార్డు

ఇటలీకి చెందిన మార్కో డీ గాస్పేరీ (30) ప్రపంచంలోకెల్లా ఎత్తయిన భవనమైన టాయ్‌పీయ్ 101, ఆకాశ హర్మ్యం 91 అంతస్థులను 11 నిమిషాల 39 సెకండ్లల్లో ఎక్కి కొత్త ప్రపంచ రికార్డును సృష్టించాడు. ఇది 86 అంతస్థులతో 1,576 మెట్లుగల ఎంపైర్ స్టేట్ బిల్డింగ్ కన్నా 400 మీ. ఎక్కువ ఎత్తు ఉంటుంది. ఈ పోటీలో మరో ఎనభై మంది పాల్గొన్నారు. జర్మనీకి చెందిన థామస్ డోల్డ్ 11 నిమిషాల 56 సెకండ్లలో ఎక్కి ద్వితీయ స్థానంలో వచ్చారు. మహిళా పోటీదార్లలో యాంద్రియా మేయిర్ (28-ఆస్ట్రియా) ఈ మెట్లను 12 నిమిషాల 54 సెకండ్లలో ఎక్కి గెలుపును కైవసం చేసుకున్నారు.

## కుక్కపిల్లకు సత్కారం!



శస్త్రచికిత్స సమయంలో ప్రాణాలు కాపాడడానికి అవసరమయ్యే రక్తం దానం చెయ్యడం గొప్ప మానవసేవగా భావించబడు తోంది. లర్చ్ అనే రెండేళ్ళ వయసు కుక్కపిల్ల అవసరమైన ప్పుడు ఇతర కుక్కలకు ఉపయోగించడానికి ఇరవైసార్లు రక్తదానం చేసింది. అమెరికా మిచిగాన్‌కు చెందిన దాని యజమాని జోని మెల్విన్-థియేడ్ తన పెంపుడు కుక్కపిల్ల ప్రతి నాలుగు వారాల కోసారి రక్తదానం చేస్తోందని చెబుతున్నాడు. దాని రక్తం ఇంత వరకు కొన్ని డజన్ల కుక్కలకు ఉపయోగ పడి ఉన్నది. తొంభై కిలోల బరువున్న లర్చ్ నెలకు ఇంచుమించు తొంభై కిలోల ఆహారం తింటుంది. మిచిగాన్ చాప్టర్ ఆఫ్ ది అమెరికన్ రెడ్ క్రాస్ సంస్థ దాన్ని 'పెట్స్ బెస్ట్ ఫ్రెండ్' అవార్డ్‌తో సత్కరించింది.



# ధృష్టద్యుమ్నుడు

తండ్రికి జరిగిన పరాభవానికి ప్రతీకారంగా ఆయన్ను పరాభవించిన బలశాలిని తుదముట్టించడానికి యజ్ఞకుండం నుంచి ఆవిర్భవించిన కారణజన్ముడైన వీరకుమారుడు ధృష్టద్యుమ్నుడు. అతడి తండ్రి పాంచాలరాజు ద్రుపదుడు. అతణ్ణి పరాభవించిన బలమైన శత్రువు ద్రోణుడు.

తరతమ భేదాలు పాటించని ప్రేమానురాగాలు నిండిన ఉన్నతమైన స్నేహానికి ఉదాహరణ పురుషులుగా కృష్ణ కుచేలురను చెప్పుకుంటారు. దానికి విరుద్ధంగా అహంకారజనిత పరాభవాలతో, ప్రతీకారాలతో జీవితాలను ఉద్రిక్తం చేసుకున్న బాల్యమిత్రులు ద్రుపద ద్రోణులు!

భరద్వాజ ఋషి కుమారుడైన ద్రోణుడు వేదాధ్యయనానంతరం అస్త్రవిద్యలు నేర్చుకోవడానికి అగ్నివేశుడనే గురువువద్ద శిష్యుడిగా చేరి ఆగ్నేయాది అస్త్రాలను సంపాదించాడు. అదే సమయంలో పాంచాల రాజు వృషతుడి కొడుకు ద్రుపదుడు కూడా అక్కడే విద్యాభ్యాసం చేస్తూండేవాడు. ఒకే గురువు వద్ద అస్త్ర విద్యను అభ్యసించడంవల్ల ఇద్దరికీ మంచి స్నేహం కుదిరింది. ఇద్దరూ ఒకే గురుకులంలో కలిసిమెలిసి ఉంటూ ధనుర్విద్య నభ్యసించారు.

విద్యాభ్యాసం పూర్తయ్యాక కొంతకాలానికి తండ్రి తరవాత ద్రుపదుడు పాంచాల దేశానికి రాజయ్యాడు.

ద్రోణుడు కృపుడి చెల్లెలు కృపిని పెళ్ళి చేసుకుని, అశ్వత్థామ అనే కొడుకును కన్నాడు. సంసారం ఈదే ప్రయత్నంలో సంపాదన మార్గం చూసుకోవలసి వచ్చింది. ఒక పట్టాన జీవనోపాధికి మార్గం కనిపించలేదు. పరశురాముడు దానధర్మాలు చేస్తున్నాడని

పురాణ వీరకుమారులు – 4

తెలిసి అక్కడికి వెళితే, ఆసరికే ఆయన తన వద్ద ఉన్న సంపదలన్నిటినీ దానధర్మాలు చేసే శాడు. మిగిలి ఉన్న దివ్యాస్త్రాలను ద్రోణుడు అడిగి పుచ్చుకున్నాడు. సంసారం గడవడం రోజు రోజుకూ దుర్భరమై పోయింది. తన బాల్యమిత్రుడు ద్రుపదుడు ఇప్పుడు రాజ య్యాడు కదా సాయంచెయ్యక పోతాడా అన్న ఆశతో అతడి వద్దకు వెళ్ళాడు.

అయితే, సింహాసనం అధిష్ఠించాక ద్రుప దుడిలో అహంకారం పెరిగి పోయింది. అతడు ద్రుపదుణ్ణి చూసి అతడి మాటలను ఏమాత్రం పట్టించుకోకుండా హేళనగా నవ్వి, ''కటిక దరిద్రుడివైన నీతో మహారాజునైన నాకు స్నేహమేమిటి? నువ్వెవరో నేనెరుగను వెళ్ళు, వెళ్ళు,'' అన్నాడు.

కాలం కలిసిరానప్పుడు తన నీడ కూడా తనకు శత్రువవుతుందని గ్రహించిన ద్రోణుడు ఆవేదనకులోనయ్యాడు. బాధను దిగమింగు కుని అవకాశం కలిగినప్పుడు ద్రుపదుడికి సరైన గుణపాఠం నేర్పాలన్న నిర్ణయంతో వెనుదిరిగాడు.

ఆ తరవాత ద్రోణుడు హస్తినాపురం చేరి బాలురుగా ఉన్న కౌరవులకూ, పాండవులకూ ధనుర్విద్యా గురువుగా చేరాడు. వారిని అస మాన వీరులుగా తీర్చిదిద్దాడు. ముఖ్యంగా అర్జునుణ్ణి సాటిలేని ధనుర్విద్యాకోవిదుణ్ణి చేశాడు. వాళ్ళ విద్యాభ్యాసం ముగిశాక, ''నాకు గురుదక్షిణ కావాలి,'' అని అడిగాడు.

''ఏం కావాలో ఉత్తరువివ్వండి,'' అని అడిగారు రాకుమారులు.



''ఐశ్వర్య మదంతో కొట్టుకుంటూన్న అవి వేకి ద్రుపదుడు. అతణ్ణి పట్టి తీసుకురండి,'' అన్నాడు ద్రోణుడు.

గురువుగారి ఆజ్ఞ నెరవేర్చడానికి కౌరవ రాకుమారులు సేనలతో వెళ్ళారుగాని, ద్రుప దుణ్ణి ఓడించడం ఎవరివల్లా కాలేదు. చావు తప్పి, కన్నులొట్టపోయిన విధంగా తిరిగి వచ్చారు.

అటుపిమ్మట అర్జునుడు భీముణ్ణీ, నకుల, సహదేవులనూ సాయంగా వెంటబెట్టు కుని వెళ్ళి, యుద్ధంలో ద్రుపదుణ్ణి ఓడించి, పట్టి కట్టి తెచ్చి గురువుకు గురుదక్షిణగా సమర్పించాడు.

ద్రోణుడు అవమాన భారంతో తలవంచు కుని నిలబడ్డ ద్రుపదుణ్ణి చూసి, ''ఎవరూ ద్రుపద మహారాజులుంగారా? ఇప్పుడునీ



రాజ్యం, రాజధాని కాంపిల్య నగరం నా వశమయింది. ఇప్పటికైనా నన్ను నీ బాల్యస్నేహితుడిగా గుర్తిస్తావా? నాకు రాజ్యాలు ఏలేవాళ్ళ స్నేహమంటే చాలా ఇష్టం. కాని ఇప్పుడు నీకు రాజ్యం లేదు. నీ స్నేహం కోసం అర్ధరాజ్యం ఇస్తాను. తీసుకో,'' అంటూ హేళన చేశాడు.

ద్రుపదుడు పైకి మైత్రి నటించినప్పటికీ అవమానంతో దహించుకుపోయాడు. ద్రోణుణ్ణి హతమార్చే కుమారుణ్ణీ, తన్ను ఓడించిన అర్జునుణ్ణి అల్లుణ్ణి చేసుకోవడానికి ఒక కుమార్తెనూ కనాలని, తపోసంపన్నులైన మునులను ఆశ్రయించాడు.

ఆఖరికి యాజుడనే ముని సాయంతో పుత్రకామేష్టి చేశాడు. యాజుడు అగ్నికుండంలో వేసిన హవిస్సు నుంచి ఒక చేత మెరుస్తున్న కత్తీ, మరొక చేత విల్లూ ధరించి, మణిమయ కిరీటంతో, రథారూఢుడై, దిక్కులు పిక్కటిల్లే లాగా సింహనాదం చేస్తూ ఒక యోధుడు పుట్టుకొచ్చాడు. అతడే ధృష్టద్యుమ్నుడు. ఆ తరవాత ఆ అగ్నికుండం నుంచే తేజస్విని అయిన ఒకస్త్రీ పుట్టింది. ఆమెయే ద్రౌపది.

కొంతకాలమయ్యాక ద్రుపదుడు ధృష్టద్యుమ్నుణ్ణి ద్రోణుడి వద్దకు అస్త్రవిద్యాభ్యాసం కోసం పంపాడు. నేర్పనంటే తనకు అపకీర్తి వస్తుందని ద్రోణుడు ద్రుపదరాజ కుమారుడికి విలువిద్య నేర్పాడు.

ద్రౌపదీ స్వయంవర మంటపంలో ఆమెను వెంట బెట్టుకుని వచ్చి, '' ఈ ఐదు బాణాలనూ ఆ వింటికి ఎక్కుపెట్టి నీడను చూసి మత్స్య యంత్రాన్ని కొట్టిన వీరుణ్ణే మా

చెల్లెలు పెళ్ళాడుతుంది,'' అని ప్రకటించిన వాడు ధృష్టద్యుమ్నుడు.

మత్స్యయంత్రాన్ని కొట్టి ద్రౌపదిని గెలుచుకున్న బ్రాహ్మణ యువకుడెవరో తెలుసుకోవడానికి ధృష్టద్యుమ్నుడు గోప్యంగా వాళ్ళ వెంట వెళ్ళాడు. వాళ్ళు ఐదుగురు అన్నదమ్ములనీ, భోజనాలు ముగించి, నిద్రకు ఉపక్రమించే ముందు యుద్ధవ్యూహ భేదనోపాయాలను గురించీ, వివిధ అస్త్రాల ప్రయోగ ఉపసంహారాల గురించీ మాట్లాడుకోవడం విన్నాడు. వాళ్ళు బ్రాహ్మణ వేషాలలో వున్న క్షత్రియ కుమారులని రూఢి చేసుకుని వచ్చి తండ్రికి ఆ సంగతి చెప్పాడు.

కురుక్షేత్ర యుద్ధంలో తండ్రితో పాటు పాండవ పక్షంలో నిలబడి వీరోచితంగా పోరాడిన మహారథుడు ధృష్టద్యుమ్నుడు. పాండవులు క్రౌంచవ్యూహం, అర్ధచంద్ర వ్యూహం, డేగవ్యూహం, మకరవ్యూహం, వజ్ర వ్యూహం, సర్వభద్ర వ్యూహం మొదలైన వ్యూహాలు పన్నడంలోనూ, కౌరవుల వ్యూహాలను ఛేదించడంలోనూ ధృష్టద్యుమ్నుడు కీలకపాత్ర వహించాడు. ద్రోణాది వీరులతో ఘోరంగా యుద్ధం చేశాడు. కొన్ని సందర్భాలలో భీముడికి తోడుగా వెళ్ళాడు.

భీష్ముడి పతనానంతరం సర్వసేనాధిపత్యం వహించిన ద్రోణుడు అతి భీకరంగా యుద్ధం చేశాడు. ధృష్టద్యుమ్నుడితో అతి భయంకరంగా యుద్ధం చేస్తూండగా-అశ్వత్థామ మరణించాడని ధర్మరాజు పలకడం ఆయన చెవిన పడింది. ద్రోణుడు విరక్తితో అస్త్రసన్యాసం చేసి, ప్రాయోపవేశం చేశాడు. అదే మంచి అదనుగా ధృష్టద్యుమ్నుడు ఆయన శిరస్సును ఖండించాడు!

యుద్ధానంతరం తొడలు విరిగి పడివున్న దుర్యోధనుడి దగ్గరికి వచ్చిన అశ్వత్థామ, అతడి దుస్థితికి జాలిపడి, తెల్లవారే సరికి పాండవులను చంపేస్తానని ప్రతిజ్ఞ చేశాడు. పాండవ శిబిరానికి వెళ్ళి, నిద్రిస్తూన్న ధృష్టద్యుమ్నుణ్ణీ, ఉపపాండవులనూ హతమార్చాడు.

ఆ విధంగా తండ్రిని అవమానించిన ద్రోణుణ్ణి హతమార్చిన ధృష్టద్యుమ్నుడు, ద్రోణుడి కుమారుడి చేతే హతుడయ్యాడు!





ముంబయి పాపులర్ ప్రకాషన్ సంస్థ మేనేజింగ్ డైరెక్టర్ రాందాస్ భక్తల్ తమ సంస్థ తరపున మరాఠీలో వంద పుస్తకాలకు పైగా, ఇంగ్లీషులో వంద పైచిలుకు పుస్తకాలు ప్రచురించారు. మరాఠీ పుస్తకాల ప్రచురణకు ఆయన మహారాష్ట్ర ఫౌండేషన్ ఆఫ్ యు.ఎస్.ఏ అవార్డునూ, ఫెడరేషన్ ఆఫ్ ఇండియన్ పబ్లిషర్స్ నుంచి 'అవుట్‌స్టాండింగ్ పబ్లిషర్ ఇన్ ఇంగ్లీష్' అవార్డునూ అందుకున్నారు. ఆయన రచించిన 'జిగ్‌సా' 'మోహన్‌మయా' గ్రంథాలు మహారాష్ట్ర ప్రభుత్వ అవార్డునూ, మరాట్వాడా సాహిత్య పరిషత్ అవార్డునూ అందుకున్నాయి. ఆయన 'గాంధీ అండ్ హిస్ అడ్వర్సరీస్' పరిశోధనా వ్యాసం సమర్పించి ముంబయి విశ్వవిద్యాలయం నుంచి డాక్టరేట్ సాధించారు.

# చెలిమివంతెన

## 1

ప్రయాణీకులను బస్సుల్లో తీసుకువెళ్ళే రోడ్డు రవాణా వ్యవస్థ అప్పుడే ఆరంభమయింది. డ్రైవర్లు జన సమ్మర్దం గల చోటనే కాకుండా ఖాళీగా ఉన్న రోడ్లపై వెళుతున్నప్పుడు కూడా కొత్తగా వచ్చిన హారన్లు మోగించేవారు. గతుకుల రోడ్ల మీద ప్రయాణీకులు కుదుపులతో ప్రయాణం చేసేవారు.

రోడ్డు మార్గానికి నదులు, వంకలు, వాగులు అడ్డు పడేవి. ప్రయాణీకులు నదుల వరకు బస్సులో వెళ్ళి, పడవల్లో నదులను దాటి అక్కడి నుంచి మరో బస్సులో ప్రయాణం కొనసాగించేవారు. కొన్ని చోట్ల ప్రయాణీకులతో సహా బస్సులను సైతం నదిని దాటించే పెద్ద పెద్ద పడవలు ఉండేవి. ఒకే రకమైన రెండు పెద్ద పడవలను ఒకటిగా దృఢమైన అంతేసి పెద్ద బరువులను మోసే విధంగా చెక్కలతో జతచేసి 'జంగిల్' అనే ఆ రకం బ్రహ్మాండమైన పడవను తయారు చేసేవారు. అక్కడక్కడ నదుల మీదుగా చిన్న చిన్న వంతెనలు కూడా ఉండేవి.

డ్రైవర్ గోవింద ఆరోజు కొత్త మార్గంలో బస్సు నడుపుతున్నాడు. అడ్డంగా ఉన్న నది మీదుగా వంతెన ఉండడం గమనించి, ఉత్సాహంతో నదిని దాటడానికి వంతెన మీద బస్సును పోనిచ్చాడు. అంతకు ముందెన్నడూ అతడు అలాంటి వంతెనను చూసి ఎరుగడు గనక, లోలోపల కొద్దిగా అనుమానం కూడా లేకపోలేదు. జాగ్రత్తగా వాహనాన్ని నడపసాగాడు.

కొద్ది క్షణాల్లో నదికి అవతలి వైపునుంచి మరొక బస్సు వంతెన మీదుగా తనకేసి రావడం గమనించాడు. తన బస్సు చక్రాలే మొదట వంతెన మీదికి ఎక్కాయని అతడు నమ్మాడు.

అందువల్ల అవతలి నుంచి వస్తున్న బస్సే వెనక్కు తిరిగి, తనకు దారి ఇవ్వగలదని ఆశించాడు. అవతలి బస్సును నడుపుతూన్న డ్రైవర్ గోపాల కూడా అచ్చం తనలాగే ఆలోచిస్తున్నాడని గోవింద ఎరుగడు. రెండు వైపుల నుంచీ క్రిక్కిరిసిన ప్రయాణీకులతో ఉన్న బస్సులను ఇద్దరూ వంతెన మధ్యకు నడిపించి ఆపారు.

ఇద్దరు డ్రైవర్లూ వాహనాల నుంచి కిందికి దిగి, "నేను ముందుకు వెళ్ళాలి. నువ్వు బండిని కాస్త వెనక్కు మళ్ళించు," అంటూ వాదానికి దిగారు. స్నేహపూరితంగా ఆరంభ మైన మాటలు మాటా మాటా పెరిగి వాగ్యుద్ధంగా మారిపోయాయి. కొమ్ములు తిరిగిన న్యాయవాదులు సైతం సిగ్గుతో తలదించుకునేలాగా పరస్పరం బలంగా వాదించసాగారు. గోవింద వంతెన మీదికి నేనే మొదట ప్రవేశించానంటే, నా బస్సులో ఎక్కువ మంది ప్రయాణీకులున్నారని గోపాల చెప్పాడు. నా బస్సు కొత్తది అని గోవింద అంటే, ఇన్నాళ్ళ అనుభవంలో ఇలాంటి పరిస్థితిని నేనెప్పుడూ ఎదుర్కోలేదని గోపాల మీసాలు దువ్వాడు. కొంత సేపటికి వాళ్ళతో పాటు రెండు బస్సుల్లోని ప్రయాణీకులు కూడా రంగంలో దిగారు. మాటల యుద్ధం చేతల్లోకి వెళ్ళింది. చూస్తుండగానే చెప్పలేని గందరగోళం. బస్సుల అద్దాలు పగిలాయి. సంచులు ఎగిరాయి. వస్తువులు చెల్లా చెదరయ్యాయి. అదృష్ట వశాత్తు ప్రాణనష్టం ఏదీ వాటిల్లలేదు. గాయపడిన వారికి సాయపడడానికి దాపులనున్న గ్రామప్రజలు పరిగెత్తుకు వచ్చారు.

## 2

ఈ దుర్ఘటన చోటు చేసుకున్న స్థలానికి కొంత దూరంలో నది సన్నగా ప్రవహిస్తోంది. చెట్టు విరిగి పడిందో, లేక స్థానికులు చెట్టును నరికి తెచ్చి పడవేశారో తెలియదుగాని, నది రెండు గట్లను కలుపుతూ చిన్నవంతెనలా దుంగ ఒకటి ఉన్నది. సాహసవంతులైన



యువకులే కాకుండా తక్కిన గ్రామస్థులు కూడా దాని మీద నడిచి వెళ్ళి నదిని దాటేవారు.

ఒకనాడు ఒక పొగరుబోతు మేక ఏటి గట్టుకు వచ్చింది. నదికి అవల పచ్చటి ఆకులు గలచెట్లు విరివిగా కనిపించాయి. తను వెళ్ళడానికి దుంగ చాలినంత లావుగా ఉన్నది. గనక జాగ్రత్తగా ఆవలికి వెళదామను కుని నాలుగడుగులు ముందుకు వేసింది. అంతలో తనకు ఎదురుగుండా ఆవలి గట్టు నుంచి అదే దుంగ మీదుగా ఒక అందమైన మేకరావడం గమనించింది. దానికి ఆక్షణంలో మానవ విషక్రిములు ప్రవేశించినట్టయి– ఆహా, అద్భుత అవకాశం దొరికింది. నా బలమైన కొమ్ములతో ఆ పొగరుబోతు మేకను ఢీకొం టాను. ఎవరు శక్తివంతులో నిరూపిస్తాను అనుకున్నది. అయితే అది మరో నాలుగడు గులు వేసే లోపల దాని చూపులు అడుగున ప్రవహిస్తున్న నదీ జలాల మీద పడ్డాయి. పోట్లాడినట్టయితే ఉభయుల గమ్యమూ నదీ జలమే కాగలదని గ్రహించింది. గండం గడవ డానికి ఒకే మార్గం కనిపించడంతో వెంటనే ముందుకాళ్ళు వంచి, దుంగమీద అలాగే పడుకుని వస్తూన్న మేకకు సైగ చేసింది. అవతలి మేక సైతం నీటి ప్రవాహాన్ని చూసి, నిజాన్ని గ్రహించి, జాగ్రత్తగా ఒక్క గెంతున దాన్ని దాటుకుని ఆవలిగట్టుకు చేరుకున్నది. రెండు మేకలు కూడా తమ స్నేహపూరితమైన కుమ్ములాటను నేలపై సుస్థిరంగా నిలబడ గల రోజుకు వాయిదా వేసి ప్రస్తుతం మేత కోసం అనుకున్న గమ్యాలను చేరుకున్నాయి.








## దేవతావిగ్రహాల వస్త్రాలంకరణలు

మామూలుగా భక్తులు ఆలయ దర్శనానికి వెళ్ళినప్పుడు గుళ్ళో దేవుణ్ణి దర్శించుకుని దణ్ణం పెట్టుకుని లెంపలేసుకుని వెలుపలికి వచ్చేస్తారు తప్ప, దేవతా విగ్రహాలకు ఎలాంటి వస్త్రాలంకరణ చేశారన్న దాని మీద దృష్టి పోనివ్వరు. పూరీలోని సుప్రసిద్ధ జగన్నాథ ఆలయ ప్రాంగణంలో ఇటీవల కృష్ణ, బలభద్ర, సుభద్రలకు అలంకరించే ముప్పై రెండు రకాల వస్త్రాలను ప్రదర్శనకు ఉంచారు. వాటిని చూసి భక్తులు తన్మయత్వం చెందారు. ఈ ప్రదర్శన చాలా ఉత్తేజభరితంగా ఉందని ఒక భక్తుడు ఆనందంతో చెప్పాడు.

## దత్తతకు పులి

పులి మన జాతీయ మృగం. 20యవ శతాబ్దం తొలి దశకంలో మన అడవుల్లో దాదాపు 40,000 పులులు ఉండేవని ఒక అంచనా. అరవై యేళ్ళ తరవాత 1972లో తీసిన మొదటి లెక్కల ద్వారా 1,800 పులులున్నాయని తెలియవచ్చింది. పులుల సంరక్షణ కోసం అప్పుడే 'ప్రాజెక్ట్ టైగర్' పథకం ప్రారంభించబడింది. కొన్ని నేషనల్ పార్క్‌సను టైగర్ రిజర్వ్‌సగా ప్రకటించారు. అప్పుడే పులిని మన జాతీయ మృగంగా చేశారు.

ఈ సంవత్సరం మొదట 1,400 పులులు మాత్రమే ఉన్నట్టు కనుగొనబడింది. దాదాపు 2,200 పులులు మాయమయ్యాయి! మన జాతీయ మృగాన్ని కాపాడుకునే శక్తి సామర్థ్యాలు మనకు లేవా? దీనికి కొన్ని పథకాలు రూపొందిస్తున్నారు. ఒరిస్సా నందన్ కానన్ టైగర్ రిజర్వ్ ఒక విలక్షణమైన పథకాన్ని ప్రకటించింది. ఈ ప్రథకం ప్రకారం ఎవరైనాసరే ఒక నిర్దిష్ట మొత్తాన్ని చెల్లించి పులిని 'దత్తత' చేసుకోవచ్చు.



## మహనీయుల జీవితాల్లో ఆసక్తికర ఉదంతాలు (33)

# విజేత చివరి విజయం

బాబర్ జీవితాన్ని (1483-1530) ధైర్య సాహసాలకూ, సమస్యలను ఎదుర్కొనే తెగువ, తెలివి తేటల ద్వారా సిద్ధించే ఘన విజయానికీ ఉదాహరణగా చెప్పవచ్చు. బాబర్ సమర్ఖండ్‌ను గడగడలాడించిన సుప్రసిద్ధ తామర్లేన్ వంశానికి చెందిన ఫర్ఘానా యువరాజు. తల్లివైపున భయంకరుడైన మంగోలీ విజేత చెంఘిజ్‌ఖాన్ సంతతికి చెందినవాడు.

అతి చిన్న రాజ్యమైన ఫర్ఘానాను ఆయన తండ్రి నుంచి పదకొండోయేట వారసత్వంగా పొందాడు. అయినా శత్రువుల కుట్ర కారణంగా ఆయన రాజభవనం నుంచి పారిపోవలసి వచ్చింది. వందేళ్ళు పైబడ్డ ఒక వృద్ధురాలి గుడిసెలో తలదాచుకున్నాడు. ఆ వృద్ధురాలు,



''నీ పూర్వులు తైమూర్, చెంఘిజ్‌ఖాన్ చేసినట్టు నువ్వెందుకు చేయకూడదు?'' అని అడగడమే సంపన్నమైన హిందూస్థాన్ మీద దండెత్తడానికి బాబరుకు ప్రేరణ కలిగించింది.

బాబర్ తనకు సొంతంగా రాజ్యం సంపాదించాలని నిర్ణయించాడు. ఇరవై ఒకటవ యేట చిన్న సైన్యాన్ని సమకూర్చుకుని కాబూల్‌ను జయించి, అక్కడి నుంచి భారతదేశం మీదికి దృష్టి సారించాడు. ఆ కాలఘట్టంలో ఢిల్లీని బలహీనుడైన సుల్తాన్ ఇబ్రహీంలోడీ పరిపాలిస్తూండేవాడు. సింహాసనాన్ని ఆక్రమించాలని బంధువు ఆలంఖాన్ కుట్రపన్న సాగాడు. అతడూ, పంజాబులో సుల్తాను ప్రతినిధిగా పాలనసాగిస్తూన్న దౌలత్ ఖాన్ భారతదేశం మీదికి దండెత్తి రమ్మని బాబర్‌ను ఆహ్వానించారు. దుర్మార్గులయిన ఈ ఇద్దరు కూడా తైమూర్, చెంఘిజ్ ఖాన్‌లలాగే నగరాలను దోచుకుని బాబర్ సైతం తిరిగి వెళ్ళిపోగలడనీ, ఆ తరవాత తామే సింహాసనాన్ని ఆక్రమించవచ్చుననీ ఆశించారు. బాబర్ సంతోషంగా వాళ్ళ పిలుపును అందుకుని పంజాబును ఆక్రమించాడు. అయితే, హిందూస్థాన్‌ను వదిలివెళ్ళే సూచనలు కనిపించలేదు. ఆశాభంగానికిలోనైన దౌలత్ ఖాన్ ఆయనకు శత్రువుగా మారిపోయాడు. బాబర్ తిరిగి వెళ్ళి మరింత పెద్ద సైన్యంతో తిరిగి వచ్చాడు. దౌలత్ ఖాన్‌ను ఓడించి బందీగా పట్టుకున్నాడు. సుప్రసిద్ధమైన పానిపట్టు యుద్ధంలో ఇబ్రహీంలోడీని హతమార్చాడు.

ఆ విధంగా, ఆంగ్లేయుల ఆగమనం వరకు భారతదేశాన్ని పాలించిన మొగల్ వంశాన్ని స్థాపించాడు.

అయితే ఇప్పుడు మనం ముచ్చటించను న్నది బాబర్‌లోని మానవతా పార్శ్వం గురించి. అందరూ చెప్పుకునే ఈ పూర్వగాథ ఆయన జీవితం చరమాంకంలో జరిగింది. అక్బర్ కొలువులోని సుప్రసిద్ధ పండితుడూ, చరిత్రకారుడూ అయిన అబుల్ ఫజల్ కూడా ఈ సంఘటన గురించి ప్రస్తావించాడు.

బాబర్ కుమారుడు హుమయూన్ వ్యాధిగ్రస్తుడయ్యాడు. ఆనాటి ప్రముఖ వైద్యులందరూ చికిత్స చేశారు. అయినా, రోగి పరిస్థితి రోజురోజుకూ క్షీణించసాగింది. బిడ్డ దయనీయ పరిస్థితిని గురించి బాబర్ నిస్సహాయంగా ఆలోచిస్తూ కూర్చున్నాడు. హిందూస్థాన్‌ను జయించి తాను గొప్పవాడనిపించుకోవడానికి వేలాది మంది ప్రాణాలు తీశాడు. ఇప్పుడేమో ఒక్క ప్రాణాన్ని, అదీ కన్న బిడ్డ ప్రాణాలను కాపాడలేని అల్పుడిగా మిగిలాడు! బిడ్డ వ్యాధి నయం చేయడానికి సాధ్యమైనవన్నీ చేయమని, వైద్యులను ప్రాథేయపడ్డాడు. ఔషధాలు తయారు చేయడానికి యావత్ రాజ్యాన్ని ధార పోయడానికి సైతం సిద్ధంగా ఉన్నట్టు చెప్పాడు.

వైద్యులు తమ కర్తవ్య నిర్వహణకు శక్తివంచన లేకుండా పోరాడారు. అయితే, వారి ప్రయత్నాలు సత్ఫలితాలనివ్వలేక పోయాయి. ఆఖరికి ప్రధాన వైద్యుడు బాబర్ ఎదుట తల వంచుకుని నిలబడ్డాడు. ''ఏమైనా చెప్పదలిచావా, మిత్రమా!'' అని అడిగాడు బాబర్.

''ప్రభువులు క్షమించాలి. మేము చేయగలిగిందల్లా చేశాం. కాని, ప్రాణాలు నిలుస్తాయన్న నమ్మకం లేదు. ఏ క్షణంలోనైనా తుది క్షణాలు రావచ్చు!'' అన్నాడు వైద్యుడు దీనంగా కళ్ళు తుడుచుకుంటూ.

బాబర్ అతడి కేసి ఒక క్షణం నిర్లిప్తంగా చూశాడు. ఆ తరవాత మోకాళ్ళ మీదికి వంగి, ధారలు ధారలుగా కన్నీరు కారుస్తూ, ''భగవంతుడా! నా బిడ్డకు బదులు నేను మరణించడానికి సిద్ధంగా ఉన్నాను. నా ప్రాణాలు తీసుకుని నా బిడ్డను కాపాడు. అతణ్ణి బతకనివ్వు,'' అంటూ చాలాసేపు ప్రార్థించి, బిడ్డ తలపై అరచేతిని ఉంచి, పడక పక్కనే మౌనంగా కూర్చున్నాడు.

కొన్ని గంటలలో యువరాజు మెల్లగా కళ్ళు తెరిచాడు. అటూ ఇటూ కదులుతూ కోలుకునే లక్షణాలు కనబరచాడు. బాబర్ కళ్ళు మసకబారాయి. కొడుకు అన్నాళ్ళు బాధ పడ్డ వ్యాధి లక్షణాలు ఆయనలో చోటు చేసుకున్నాయి. ఆయన మంచం పట్టి మూడు నెలలలో కన్నుమూశాడు. -(ఎం.డి)





బీర్బల్ కథలు : 13

# ఎత్తుకు పైఎత్తు

సమయస్ఫూర్తితో, చమత్కార సంభాషణతో, వివేకవంతమైన సలహాలతో అక్బర్ చక్రవర్తి అభిమానాన్ని చూరగొన్న బీర్బల్ అంటే ఆస్థానోద్యోగులు కొందరు అసూయ పడేవారు. బీర్బల్‌ను చక్రవర్తి అభిమానానికి దూరం చేయాలని ఆశించేవారు. ముఖ్యంగా ఆస్థాన వైద్యుడు హకీం జలీమ్ ఖాన్, అతడి సన్నిహిత మిత్రులు బీర్బల్‌ను ఎలాగైనా ఆస్థానం నుంచి తొలగించాలని సరైన అవకాశం కోసం ఎదురు చూడసాగారు.

ఇలా వుండగా అక్బర్ చక్రవర్తికి ఉన్నట్టుండి జ్వరం రావడంతో ఆస్థాన వైద్యుడి కోసం కబురు చేశాడు. వైద్యుడు ఔషధాలను తీసుకుని ఇంటి నుంచి బయలుదేరుతూండగా హడావుడిగా వచ్చిన అతడి మిత్రులు, ''మనం ఎదురు చూసిన అవకాశం రానే వచ్చింది. దీనిని జారవిడుచుకోకుండా సద్వినియోగం చేసుకోవాలి. మేము చెప్పినట్టు చేశావంటే ఆస్థానం నుంచి బీర్బల్ ఉద్వాసన ఖాయం,'' అన్నారు.

''అలాగా! చాలా సంతోషం. ఏం చేయాలో చెప్పండి, మరి,'' అని అడిగాడు వైద్యుడు ఉత్సాహంగా.

వారిలో వృద్ధుడైన ఒక రాజోద్యోగి, వైద్యుడి దగ్గరికి వెళ్ళి చెవిలో ఏదో రహస్యంగా చెప్పాడు.

ఆ మాట వినగానే వైద్యుడి కళ్ళు ఆనందంతో విప్పారాయి. ఉత్సాహంగా రాజదర్శనానికి బయలుదేరాడు.

చక్రవర్తి కంబళి కప్పుకుని పడకపై పడుకున్నాడు. ఆయన్ను చాలా సేపు రకరకాలుగా పరీక్షించిన హకీం, ఆయనకేం పెద్ద జబ్బు లేదనీ, కావలసిందల్లా కొన్ని రోజుల పాటు విశ్రాంతి మాత్రమేననీ గ్రహించాడు. అయినా అసలు సంగతిని బయటపెట్టకుండా, ''ఇది చాలా తీవ్రమైన వ్యాధి అలంపనా! దీనికి నా దగ్గర చక్కటి ఔషధం ఉన్నది,'' అని చెప్పి కొంత సేపు ఆగి, ''ఈ భస్మాన్ని ఎద్దుపాలతో కలిపి తీసుకుంటే త్వరగా పనిచేస్తుంది,'' అన్నాడు.

‘‘ఏమిటీ, ఎద్దుపాలతోనా?’’ అని ఆశ్చర్య పోయాడు చక్రవర్తి నమ్మలేనట్టు.

‘‘అవును. ఆలంపనా. కనుగొనడం కష్టమే గాని, కొన్ని ఎద్దులు పాలిస్తాయి,’’ అన్నాడు వైద్యుడు గుంభనగా.

‘‘అలా పాలిచ్చే ఎద్దును ఎవరు కనుగొన గలరు?’’ అని అడిగాడు చక్రవర్తి.

‘‘ఆ పని బీర్బల్ చేయగలడు ప్రభూ. అతడు చాలా తెలివైనవాడూ, ప్రభువుల అభిమానం పొందినవాడూ కదా?’’ అన్నాడు వైద్యుడు.

‘‘బీర్బలా? నిజంగానే అతడీ పని చేయ గలడంటావా?’’ అని అడిగాడు చక్రవర్తి.

‘‘అవును, ఈ పని బీర్బల్ మాత్రమే చేయగలడు ప్రభూ. నేను ఇచ్చే ఈ భస్మాన్ని ఎద్దుపాలతో కలిపి రోజుకు మూడు పూటలు సేవించండి. ఎద్దుపాలు దొరక్కపోతే ఆవుపాల అనుపానంతో తీసుకోవచ్చు. అయితే, వ్యాధి నయం కావడానికి మరి కొంత ఆలస్యమవు తుంది,’’ అని చెప్పి వైద్యుడు భస్మం సంచీని తీసి ఇచ్చి, చక్రవర్తికి వంగి సలాం చేసి వెళ్ళి పోయాడు.

చక్రవర్తి వెంటనే బీర్బల్‌ను పిలిపించాడు.

బీర్బల్, ‘‘ఆరోగ్యం ఎలా వుంది ప్రభూ,’’ అని పలకరిస్తూ వచ్చాడు.

‘‘బాగా లేదు బీర్బల్. జ్వరం, ఒళ్ళంతా ఒక విధమైన పోట్లు. ఎద్దు పాల అనుపానంతో భస్మం తీసుకుంటే వ్యాధి త్వరగా నయమవుతుందని ఆస్థాన వైద్యుడు హకీం చెబుతున్నాడు,’’ అన్నాడు చక్రవర్తి.

‘‘ఎద్దుపాలా? వింతగా ఉందే. ఎద్దు పాలిస్తుందని ఎప్పుడూ వినలేదే,’’ అన్నాడు బీర్బల్.

‘‘పాలిచ్చే ఎద్దులు అరుదుగా ఉంటా యని హకీం చెబుతున్నాడు. అయితే అవి ఉన్న చోటు తనకు తెలియదట. నువ్వు దాన్ని కనుగొని పాలు తేగలవని చెబుతున్నాడు,’’ అన్నాడు చక్రవర్తి.

‘‘నేను ఎద్దు పాలు తేగలనని హకీం అను కుంటున్నాడా?’’ అని అడిగాడు బీర్బల్.

‘‘అవును బీర్బల్. నువ్వు నా కోసం ఆ పని చేసిపెట్టవూ,’’ అన్నాడు చక్రవర్తి.

‘‘హుజూర్, తమ కోసం నేను ఏమైనా చేయగలను. మీరు త్వరగా ఆరోగ్య వంతులు కావాలి. ఇప్పుడే ఆ పని మీద వెళతాను.





సమయం వృధా చేయకూడదు కదా,'' అంటూ నమస్కరించి బయలుదేరాడు.

ఇంటికి వెళ్ళే దారిలో బీర్బల్ తీవ్రంగా ఆలోచించి, హకీం విరిసిన వల నుంచి బయటపడే పథకం సిద్ధం చేసుకున్నాడు. ఇంటికి వెళ్ళి కూతురును పిలిచి తన సమస్య చెప్పాడు.

ఆ అమ్మాయి చాలా తెలివైనది. తెలివి తేటలకు తగ్గ మాటకారితనం, ధైర్యం గల తండ్రికి తగ్గ కూతురు.

''ఎద్దు పాల గురించి ఎవరైనా విన్నారా?'' అని ఆశ్చర్యపోయింది కూతురు.

''హకీం విన్నాడు. కాని కనుగొనలేడు. ఆ పని నాకు అప్పగించారు,'' అన్నాడు బీర్బల్ నింపాదిగా.

''హకీంకు నువ్వంటే గిట్టదా? ఆయన నీ శత్రువా?'' అని అడిగింది కూతురు.

బీర్బల్ అవునన్నట్టు తలపంకిస్తూ, ''నువ్వొక పని చేయాలి,'' అన్నాడు.

ఏమిటి అన్నట్టు చూసింది కూతురు ఉత్సాహంగా. బీర్బల్ ఏం చెయ్యాలో ఆమె చెవిలో చెప్పాడు.

ఆ నాటి అర్ధరాత్రి సమయంలో ఒక పెద్ద బట్టల మూట తీసుకుని నమ్మకస్థుడైన ఒక నౌకరును వెంటబెట్టుకుని బీర్బల్ కూతురు నది వద్దకు వెళ్ళింది.

రాజభవనానికి సమీపంలో వున్న రేవు దగ్గిర బండమీద బట్టలుతకడం ప్రారంభించింది. బట్టలను, ఒక్కొక్కటిగా తీసి నీళ్ళల్లో తడిపి బండపై వేసి, దభీదభీమని కట్టెతో బాదుతూ, నౌకరుతో బిగ్గరగా మాట్లాడసాగింది.

నదీతీరంలోని రాజభవనంలో చక్రవర్తి శయ్యాగృహం ఆ రేవుకు సమీపంలోనే ఉన్నది.

ఆ ఇద్దరు పుట్టించే శబ్దాలకు రాజుకు నిద్రాభంగమయింది. చక్రవర్తి కోపంతో భటుణ్ణి పిలిచి, ''ఈ అపరాత్రి వేళ ఏమిటా శబ్దాలు? వెళ్ళి చూడు. వెంటనే వాళ్ళను అక్కడి నుంచి తరుము,'' అని ఆజ్ఞాపించాడు.

భటుడు హుటాహుటిగా వెళ్ళి బట్టలు తుకుతూన్న అమ్మాయిని చూసి, ''ఏవమ్మాయి, ఇదేనా బట్టలుతికే సమయం? పగలంతా ఏం చేశావు?'' అని అడిగాడు ఈటెను పైకెత్తి.

‘‘ఏం, నది పగల్లో మాత్రమే ప్రవహిస్తుందా?’’ అంటూ నవ్వుతూ ఆమె తల పైకెత్తి చూసింది.

‘‘అనవసరంగా నాతో వాదించకు. చిక్కుల్లో పడగలవు,’’ అని హెచ్చరించాడు భటుడు.

‘‘చిక్కుల్లో పడడమా? బట్టలుతికినందుకు చిక్కుల్లో ఎందుకు పడతాను? ధర్మ ప్రభువులైన షహెన్‌షా పాలన జరుగుతున్నది,’’ అన్నది ఆ అమ్మాయి.

‘‘నువ్వు చేసే శబ్దం వల్ల చక్రవర్తిగారికి నిద్రాభంగమయింది,’’ అన్నాడు భటుడు గద్దిస్తున్నట్టు.

‘‘శబ్దం రాకుండా నువ్వు బట్టలుతకగలవా?’’ అని అడిగిందా అమ్మాయి.

‘‘ఎవరు నువ్వు?’’ అని అడిగాడు భటుడు కోపంగా.

‘‘ఆడపిల్లను,’’ అన్నదామె.

‘‘మొదట మీ తండ్రిని పిలిచి నీకు కాస్త బుద్ధి నేర్పమని చెప్పాలి. నువ్వు ఎవరి కూతురివో చెప్పు,’’ అన్నాడు భటుడు.

‘‘మా తండ్రి కూతురిని,’’ అన్నదా అమ్మాయి.

‘‘నోర్ముయ్. ఇలా పని కాదు. చక్రవర్తి దగ్గరికి వెళదాం రా. ఆయనే నీకు తగిన బుద్ధి చెప్పగలరు. నీ పొగరుబోతు ధోరణి చూస్తుంటే చీకటి కొట్టు వాసం తప్పదులాగుంది,’’ అంటూ బయలుదేరాడు భటుడు.

ఏమాత్రం భయపడకుండా ఆ అమ్మాయి భటుడి వెంట చక్రవర్తి దగ్గరికి వెళ్ళింది. భటుడు చక్రవర్తికి వంగి నమస్కరించి సంగతి చెప్పాడు.

‘‘అర్ధరాత్రి వేళ బట్టలెందుకు ఉతుకుతున్నావు?’’ అని అడిగాడు చక్రవర్తి.

‘‘ఈ సాయంకాలమే మా నాన్న అందమైన మగబిడ్డను ప్రసవించారు, షహెన్‌షా,’’ అని సమాధానమిచ్చింది ఆ అమ్మాయి.

‘‘ఏమిటా అసంబద్ధ ప్రేలాపన!’’ అంటూ ఉరిమాడు చక్రవర్తి.

‘‘నాన్నకు కానుపు చూసి శిశువును శుభ్రం చేయడానికే పొద్దంతా సరిపోయింది,’’ అన్న ఆమె మాటలకు అడ్డుపడి, ‘‘నాన్నకు కానుపు చూశావా? ఏమిటి నువ్వంటున్నది?’’ అని అడిగాడు చక్రవర్తి.

‘‘అవును, షహెన్‌షా,’’ అన్నదా అమ్మాయి అమాయకంగా.



''మీ అమ్మ అని చెప్పడానికి బదులు పొరబాటున నాన్న ప్రసవించాడని అంటున్నావు? అంతే కదా?'' అని అడిగాడు చక్రవర్తి.

''లేదు ప్రభూ. మా నాన్నే మగబిడ్డను ప్రసవించారు,'' అన్నదా అమ్మాయి చిన్నగా నవ్వుతూ.

''నీకేమైనా పిచ్చిపట్టిందా?'' అంటూ చక్రవర్తి పిడికిలి బిగించి పక్కనున్న బల్లను గట్టిగా గుద్దాడు పట్టరాని కోపంతో.

''లేదు ప్రభూ! నేను నిజమే చెబుతున్నాను. అక్షరాలా నిజం,'' అన్నదా అమ్మాయి దృఢమైన కంఠస్వరంతో.

''మగవాడు ప్రసవించాడని నమ్మమంటున్నావు? మనం ఏ వింత లోకంలో నివసిస్తున్నాం,'' అంటూండగా చక్రవర్తి కనుబొమలు ముడిపడ్డాయి.

''ప్రభువులు క్షమించాలి. ఇదే లోకంలోనే కొన్ని వ్యాధులను ఎద్దుపాలు త్వరగా నయం చేస్తాయని విన్నాను. అది వింత కాదా?'' అంటూ ఆ అమ్మాయి రాజు కేసి సూటిగా చూసింది.

''అంటే, నువ్వు బీర్బల్ కూతురివన్న మాట!'' అన్నాడు చక్రవర్తి.

''అవును, ప్రభూ! తమకు నిద్రాభంగం కలిగించినందుకు క్షమించండి. ఎద్దులు పాలిచ్చినప్పుడు మగవాళ్ళు పిల్లల్ని కంటారు. రాత్రులు ఎండలు కాస్తాయి!'' అన్నది తల వంచి వినయంగా.

''నువ్వు చాలా తెలివైన అమ్మాయివి. ఇప్పటికే ఇన్ను నాకు ఎద్దుపాలు తెచ్చి ఇచ్చేశావని మీ నాన్నకు తెలియజెయ్,'' అంటూ చక్రవర్తి బంగారు మొహరీల సంచీని తీసి ఆమె చేతికి అందించాడు.

ఆమె వంగి నమస్కరించి అక్కడి నుంచి భవనం నుంచి వెలుపలికి నడిచింది.

''ఎద్దుపాలు! ఛీ, ఛీ! జలీంఖాన్‌కు ఈ ఆలోచన ఎక్కణ్ణించి వచ్చింది? బీర్బల్‌ను చిక్కుల్లో పడేయాలనుకున్నాడా? ఆ సంగతి రేపు చూడాలి,'' అనుకుంటూ చక్రవర్తి నిద్రలోకి జారుకున్నాడు.



మరుసటి రోజు ఆస్థాన వైద్యుడు హకీం జలీంఖాన్‌కు మరీ చెడ్డరోజుగా పరిణమించింది.

## కర్ణాటక జానపద కథ

# బ్రాహ్మడు - బిచ్చగాడు

బ్రాహ్మడొకడు సాయంకాలాల్లో పురాణ కాలక్షేపం చేస్తూ జీవయాత్ర సాగించేవాడు. ఆయన ఉపన్యాసాలు వినడానికి వచ్చే భక్తులు పళ్ళెంలో ఒకటి రెండు కాసులు వేసి వెళ్ళేవారు. అయితే రోజులు కానుకాను పురాణ కాలక్షేపానికి వచ్చే భక్తుల సంఖ్య బాగా తగ్గిపోయింది. ఆయన తన ఉపన్యాసాలలో రోజూ చెప్పిన విషయాలే మళ్ళీమళ్ళీ చెబుతున్నట్టు వాళ్ళు భావించారు. భక్తుల రాక తగ్గడంతో బ్రాహ్మడి రాబడి కూడా తగ్గిపోయింది. పేదరికం ఆయన్ను ఆవరించింది.

ఏదైనా కాయకష్టం చేయడం ఆయన లోకువగా భావించాడు. రోజూ సమీపంలోని అమ్మవారి ఆలయానికి వెళ్ళి, ప్రార్థనలు జరపసాగాడు. ఒకనాడు అలా వెళ్ళి అమ్మవారి విగ్రహం ఎదుట నిలబడి, ''లోకమాతా! నేను ఆకలితో మరణించాలన్నది నీ సంకల్పమయితే, ఎవరి పట్లా ఎలాంటి అసంతృప్తీ లేకుండా ఈ లోకం నుంచి నిష్క్రమిస్తాను,'' అని కన్నీళ్ళతో ప్రార్థించాడు. ఆ తరవాత అలాగే ఆలయ ప్రాంగణంలోనే పడుకుని నిద్రపోయాడు. ఆ రాత్రి కలలో దేవత కనిపించి, ''బిడ్డా! నువ్వు క్షుద్బాధతో మరణించడం నాకిష్టం కాదు. నీ కష్టాలు నేను తీరుస్తాను. అయితే, నానుంచి నువ్వు పొందే దానిలో కొంత భాగం పేదలకు దానంగా ఇవ్వాలి,'' అని చెప్పి అంతర్ధానమయింది.

బ్రాహ్మడు ఆనందంతో లేచి కళ్ళు తెరిచి చూశాడు. తను దిండులా మడిచి తలకింద పెట్టుకున్న శాలువా అడుగున చిన్న మూట కనిపించింది. సంచీ మూతి విప్పి చూశాడు. అందులో వంద వెండికాసులు కనిపించాయి. బ్రాహ్మడు గర్భగృహంలోని దేవత విగ్రహం కేసి తిరిగి, ''తల్లీ! జగన్మాతా! నువ్విచ్చిన దానిలో





మీమేలు మరవను. మీరు చల్లగా ఉండాలి,'' అన్నాడు బిచ్చగాడు.

బ్రాహ్మడు ఉత్సాహం కొద్దీ తన కల, దేవత కరుణతో ఇచ్చిన కాసుల మూట, అందులో కొంత దానం చెయ్యమన్న విషయం గురించి బిచ్చగాడికి చెప్పాడు.

''అలాగా! ఎంత అదృష్టం! అమ్మవారు తమకు వంద కాసుల సంచీ ఇచ్చిందా? లోకాలను కాపాడే ఆ తల్లి ఇచ్చిన ఆ కాసుల సంచీని ఈ గుడ్డి బిచ్చగాణ్ణి కాస్తా తాకి చూడనిస్తారా స్వామీ,'' అన్నాడు గుడ్డిబిచ్చగాడు పట్టరాని ఆనందంతో.

''ఇదిగో, తాకడమే కాదు. కావాలంటే దాని బరువును కూడా చూడు,'' అంటూ బ్రాహ్మడు కాసుల సంచీని బిచ్చగాడి చేతికిచ్చాడు.

ఫదోవంతు దానంగా ఇస్తాను! ఇప్పటిలాగే నీ చల్లని చూపులు నిరంతరం నాపై ప్రసరించు తల్లీ,'' అని చెప్పి ఆలయం వెలుపలికి వచ్చాడు. కొన్ని రోజులుగా సరిగ్గా అన్నపానాలు లేవు. మొదట ఆకలి బాధ తీర్చుకోవాలనుకున్నాడు. అంతకు ముందు అందులో కొంత దానంగా ఇవ్వగలనని దేవతకిచ్చిన మాట కాపాడుకోవాలని కూడా నిర్ణయించుకున్నాడు.

ఆయన కొంత దూరం వెళ్ళాక ఒక భోజనశాల ముందు గుడ్డి బిచ్చగాడొకడు కనిపించాడు. వాడి దీన స్థితికి జాలిపడి వెంటనే సంచీ విప్పి అందులో నుంచి పది వెండికాసులు తీసి బిచ్చగాడి జోలెలో వేశాడు.

''ఎవరు బాబూ ఆ ధర్మప్రభువు. మీలాగా ఒకేసారి ఇన్ని కాసులు ఇచ్చిన వారెవరూ లేరు.

దాన్ని అందుకున్న బిచ్చగాడు, ''కళ్ళులేని కబోదిని. సంచీని చూడలేకపోతున్నాను. అయినా అది ఎంత మెత్తగా ఉందీ, తమరు గొప్ప పుణ్యాత్ములు స్వామీ,'' అంటూ సంచీని తన చంకకు తగిలించుకున్న జోలెలో వేసుకుని ఊతకర్రను తట్టుకుంటూ ముందుకు నడవసాగాడు.

బ్రాహ్మడు దిగ్భ్రాంతి చెందాడు. ''ఏమిటి నువ్వు చేస్తూన్న పని? నా సంచీ తీసుకుని ఎక్కడికి పోతున్నావు. అది నాది. ఇలా ఇవ్వు,'' అంటూ బిచ్చగాణ్ణి వెంబడించాడు.

''సంచీ ఏమిటి? అలాంటిది నువ్వు నాకు ఇవ్వలేదే!'' అన్నాడు బిచ్చగాడు గట్టిగా.

''కాసుల సంచీ... జగన్మాత ఇచ్చిన కాసుల సంచీ,'' అంటూ బ్రాహ్మడు బిచ్చగాడి భుజా

నికి వేలాడుతూన్న జోలెలో ఉన్న ఆ సంచీని లాక్కోడానికి ప్రయత్నించాడు. కాని బిచ్చగాడు దాన్ని గట్టిగా పట్టుకుని కేకలు పెట్టాడు. బ్రాహ్మడి ప్రయత్నం ఫలించలేదు. పైగా దారిన వెళుతూన్న కొందరు వాళ్ళ చుట్టూ చేరారు. వాళ్ళల్లో ఒకడు, ''ఏమిటీ గొడవ?'' అని అడిగాడు.

బిచ్చగాడు వెంటనే, ''చూడండి, బాబూ. ఈ పెద్దమనిషి నా సంచీని దొంగిలించడానికి ప్రయత్నిస్తున్నాడు! కళ్ళు లేని పేద బిచ్చగాణ్ణి. జీవితాంతం దమ్మిడీ దమ్మిడీగా కూడబెట్టిన మొత్తాన్ని ఒక్కసారిగా దోచుకోవాలని చూస్తున్నాడు,'' అన్నాడు కోపావేశంతో.

''మొత్తం ఎంత కూడబెట్టావేమిటి?'' అని అడిగాడు గుంపులో నుంచి మరొకడు.

''తొంభై వెండి కాసుల దాకా ఉండవచ్చనుకుంటాను? చూడు, బాబూ,'' అంటూ బిచ్చగాడు జోలెలో నుంచి సంచీని తీసి అడిగిన ఆ మనిషి చేతికిచ్చాడు.

అతడు, ''ఒకటి, రెండు, మూడు...'' అని లెక్కపెట్టి, ''అవును, సరిగ్గా తొంభై వెండి కాసులు ఉన్నాయి,'' అంటూ సంచీని బిచ్చగాడి చేతికిచ్చి బ్రాహ్మడి కేసి తిరిగి, ''ఇప్పుడేమంటావు?'' అని అడిగాడు.

తన కల గురించీ దేవత ఆ సంచీని ఇవ్వడం గురించీ పదిమందిలో చెప్పడం భావ్యం కాదని భావించిన బ్రాహ్మడు, తను బిచ్చగాడికిచ్చిన పది కాసులూ, తన సంచీలో మిగిలి వున్న తొంభై కాసుల గురించి కూడా చెప్పలేక మౌనంగా ఉండిపోయాడు.

''కళ్ళు లేని బిచ్చగాడి నుంచి దొంగిలించడానికి ప్రయత్నించడం నీలాంటి వాడు చేయతగింది కాదు. చాలా సిగ్గుమాలిన పని,'' అంటూ బ్రాహ్మణ్ణి మందలించి వెళ్ళారు అక్కడ చేరిన వాళ్ళు.

వాళ్ళతో పాటే బిచ్చగాడు కూడా ఎటో వెళ్ళిపోయాడు. బిచ్చగాడికి బుద్ధి చెప్పడం ఎలాగా అని తీవ్రంగా ఆలోచిస్తూ కొంత సేపు అక్కడే



## మన దేశం క్విజ్

ఈ నెల క్విజ్ పురాణాలకు సంబంధించినది



1. ఏడు గుర్రాల రథం మీద ఏ దేవుడు ఊరేగుతాడు?
2. కృష్ణుడి గురువు ఎవరు?
3. మూడు నేత్రాలుగల దేవుడు ఎవరు?
4. పురాణాలలో చెప్పబడిన పంచకన్యలు ఎవరు?
5. యోగశాస్త్రం రచించినవారెవరు?
6. దేవతల వైద్యులు ఎవరు?
7. విష్ణువు చతుర్భుజాలలో వేటిని ధరిస్తాడు?
8. రోగ నాశకుడిగా ఏ దేవుణ్ణి చెబుతారు?

(సమాధానాలు 74వ పేజీలో)

నిలబడ్డ బ్రాహ్మడు, వాణ్ణి వెతుక్కుంటూ బయలుదేరాడు.

ఆఖరికి వాడు సంత సమీపంలోని ఒక సత్రం అరుగు మీద కనిపించాడు. చాపపై కూర్చుని పక్కనే బ్రాహ్మడి డబ్బు సంచీని ఉంచుకున్నాడు. తన దగ్గరున్న కాసులను ఒక్కొక్కటిగా తీసి ఒక వెదురు దుడ్డుకర్రలో దాస్తున్నాడు. బహుశా ఆ వెదురు దుడ్డుకర్ర లోపల బోలుగా ఉండాలి. దుడ్డుకర్రలో కాసులను వేశాక దాన్ని పక్కలో పెట్టుకుని జోలెను తలకింద దిండుగా పెట్టుకుని పడుకున్నాడు.

ఆ తరవాత బ్రాహ్మడు అక్కడి నుంచి తిరిగి వెళ్ళి, తెల్లవారే సరికి అక్కడికి చేరుకున్నాడు. బిచ్చగాడు నిద్రలేచి దుడ్డుకర్రను పట్టుకుని బిచ్చమెత్తుకోవడానికి బయలుదేరాడు. బ్రాహ్మడు బిచ్చగాడి దగ్గరున్న దుడ్డుకర్రలాంటి దాన్నొకటి తయారు చేయాలనుకున్నాడు. దాపులనే ఒక వెదురుపొద ఉన్నదని గుర్తు రావడంతో, అక్కడికి వెళ్ళి ఒక సన్నటి వెదురు గడను నరికి బోలుగా దుడ్డుకర్రను తయారు చేశాడు. పొద్దుపోయాక సత్రం వద్దకు వెళ్ళి బిచ్చగాడి కోసం కాచుకున్నాడు. కిందటి రాత్రిలాగే కొంతసేపటికి బిచ్చగాడు వచ్చి, బట్టను పరిచి కూర్చుని, సంచీలోని ఒకటి రెండు నాణాలను తీసి దుడ్డుకర్ర బొంగులో వేసి, దాన్ని పక్కనే పెట్టుకుని నిద్రపోయాడు.

బిచ్చగాడు గాఢనిద్రలో ఉండగా, బ్రాహ్మడు వెళ్ళి తను తయారుచేసిన దుడ్డుకర్రను, బిచ్చగాడి పక్కన ఉంచి, వాడి దుడ్డుకర్రను తీసుకుని వచ్చేశాడు. సంతవరకు వెళ్ళి ఒక అరుగు

మీద కూర్చుని, దుడ్డుకర్రలోని కాసులను శాలువా పరిచి అందులోకి రాల్చాడు. తొంభై వెండి కాసులను లెక్కించి తీసుకుని మిగిలినవి ఎన్ని ఉన్నాయో కూడా లెక్కించకుండా, మళ్ళీ దుడ్డుకర్రలో నింపి, బిచ్చగాడు నిద్ర పోతూన్న సత్రం వద్దకు వెళ్ళి, ఆ దుడ్డుకర్రను వాడి పక్కన ఉంచి, తను ఉంచిన దుడ్డు కర్రను తీసుకుని గుడికేసి నడిచాడు.

గర్భగృహంలోని దేవత విగ్రహం ముందు నిలబడి, ''జగన్మాతా! నా చర్యకు నన్ను క్షమించు. నువ్వు ఇచ్చిన దానిని మాత్రమే తీసుకున్నాను. బిచ్చగాడి సొమ్మును ముట్టుకో లేదు. నీకిచ్చిన మాట ప్రకారం వాడికిచ్చిన పది కాసులు కూడా తీసుకోలేదు. జన్మజన్మలకు నీ మేలు మరిచిపోను,'' అని ప్రార్థించి వెలుపలికి వచ్చాడు.

బ్రాహ్మడిలో అనుకోకుండా బిచ్చగాడు ఇప్పుడు ఏం చేస్తున్నాడో చూద్దామన్న ఉత్సుకత కలిగింది. సత్రం వద్దకు వెళ్ళాడు. బిచ్చగాడు ఎదురు పడ్డాడు. వాడి ధోరణి చూస్తూంటే కాసులు పోయిన విషయం గమనించినట్టే ఉంది. వాడి వెనకగా కొంత దూరం నడిచిన బ్రాహ్మడు, బిచ్చగాణ్ణి పలకరించి, ''నీకు పది కాసులిస్తే, నా దగ్గరున్న తొంభై కాసులు కూడా దొంగిలించావు. నన్ను గుర్తుపట్టావా?'' అని అడిగాడు.

''అవునవును. అప్పుడే ఎలా మరిచిపోగలను? నీకు వంద కాసులిచ్చిన అమ్మవారు వాటిని మళ్ళీ వెనక్కు తీసుకున్నది. ఆమె నాకు కలలో కనిపించి చెప్పింది. ఆ రోజు నీకు నేను చేసిన అపకారానికి నన్ను క్షమించు,'' అన్నాడు.

బ్రాహ్మడు వాడి మాటలను నమ్మడమా వద్దా అన్న సందిగ్ధంలో పడ్డాడు. అయినా అంతా శుభంగానే ముగిసింది కదా అన్న తృప్తితో తన ఇంటికేసి నడవసాగాడు.



# ఒలింపిక్స్ - భారతదేశం



నేషనల్ స్టేడియం



నేషనల్ అక్వాటిక్ సెంటర్



గగాన్ నారంగ్



సురేందర్ సింగ్



దోలా బెనర్జీ



ఆగస్ట్ 8వ తేదీ బీజింగ్ ఒలింపిక్ గేమ్స్ వైభవంగా ఆరంభమయ్యాయి. భారతదేశం తరపున పాల్గొనడానికి 57 మందిగల కంటింజెంట్ చైనా రాజధానికి చేరుకున్నది. వారిలో తరచూ వార్తల పతాక శీర్షికలను అలంకరించే సుప్రసిద్ధులైన దోలా బెనర్జీ (ఆర్చెరీ), అంజు బాబీ జార్జ్ (లాంగ్‌జంప్) సురేందర్ సింగ్ (10,000 మీ.), మంజిత్ కౌర్ (400 మీ.) సాయ్‌నా నేహ్వాల్ (బ్యాడ్మింటన్) ఖముజాం టోంబి దేవి (జూడో) రాజ్యవర్ధన్ సింగ్ రాథోడ్, గగాన్ నారంగ్, అంజలి భగవత్ (షూటింగ్) విర్ధవాల్ ఖాడే (స్విమ్మింగ్) లియాండర్ పేస్, మహేష్ భూపతి, సానియా మీర్జా (టెన్నిస్) మోనికా దేవి (రెస్లింగ్) మున్నగువారు చోటు చేసుకున్నారు.

ఈ సందర్భంగా గత వందయేళ్ళలో ఒలింపిక్స్‌లో భారతదేశం సాధించిందేమిటో గుర్తు చేసుకోవడం ఆసక్తికరమైన విషయం. భారతదేశం మొట్టమొదటి సారిగా 1920 (అంట్వెర్ప్ ఒలింపిక్స్)కు ఇద్దరు అథ్లెట్స్‌ను పంపింది. ఆ తరవాత ప్యారీస్‌లో జరిగిన క్రీడలకు మన దేశం 8 మంది అథ్లెట్స్‌ను పంపింది. అయినా అంతకు పూర్వమే ఒక ఇండియన్ అథ్లెట్ నార్మన్ ప్రిచ్చార్డ్ ఇంగ్లాండు ప్రతినిధిగా ప్యారీస్ (1900) క్రీడల్లో పాల్గొని 200 మీ. లోనూ 200 మీ. హర్డిల్స్‌లోనూ రెండు రజత పతకాలు గెలుపొందాడు. 1928 అమ్స్టర్‌డ్యామ్ గేమ్స్‌లో భారతదేశం తరపున పాల్గొన్న హాకీ టీమ్ బంగారు పతకం సాధించింది. ఆ





బర్లీన్ ఒలింపిక్స్ (1936)లో విజయం సాధించిన హాకీ టీమ్

యేడే హాకీని ఈవెంట్‌గా ప్రవేశపెట్టారు. జయ్‌పాల్ సింగ్ టీమ్ కెప్టెన్. ఆ తరువాత జరిగిన 1932, 1936, 1948 క్రీడల్లో భారత విజయానికి 'హాకీ విజార్డ్' ధ్యాన్‌చంద్ ప్రముఖపాత్ర వహించాడు. 1964 (టోక్యో) 1980 (మాస్కో) క్రీడల్లో భారత్ బంగారం గెలుపొందింది. 1966 రోమ్‌లో జరిగిన ఒలింపిక్స్‌లో భారత్ రజతం సాధించింది గాని మెక్సికో (1968)లోనూ, మ్యూనిచ్ (1972)లోనూ కాంస్యంతో సరిపెట్టుకోవలసి వచ్చింది. ఏథెన్స్ (2004)లో హాకీలో భారత్ ఏడవస్థానంలో ఉంది. ఇటీవల అంటే 2008 గేమ్స్‌లో ఇండియన్ టీమ్ పాల్గొనే అర్హత కూడా పొందలేక పోయింది.

హాకీ కాకుండా ఇతర పతకాలను చూసినట్టయితే అథ్లెటిక్స్‌లో రెండు రజతాలు; రెస్లింగ్, షూటింగ్, వెయిట్ లిఫ్టింగ్, టెన్నిస్‌లలో నాలుగు కాంస్య పతకాలు పొందింది. దాదాసాహెబ్ జాదవ్, డా. కార్ణిసింగ్, కరణం మల్లేశ్వరి, టెన్నిస్ క్రీడాకారులు లియాండర్ పేస్, మహేష్‌భూపతి విజేతలుగా నిలిచారు. 1984 లాస్ ఏంజెలస్ క్రీడల్లో 400 మీ. హర్డిల్స్‌లో 1/100 సెకండ్‌తో పి.టి. ఉష కాంస్య పతకాన్ని పోగొట్టుకున్నది. హెన్రీ రెబెల్లో ట్రిపుల్ జంప్, లండన్ (1948) మిల్ఖాసింగ్ (400 మీ. రోమ్ 1960) గురుబచన్ సింగ్ రంధవా (100 మీ. హర్డిల్స్, టోక్యో 1964) శ్రీరాంసింగ్ (800 మీ. మాంట్రియల్ 1976) మున్నగు క్రీడాకారులు చెప్పుకో తగ్గ రీతిలో తమ ప్రతిభను కనబరచారు. భారత్ మహిళా 400 మీ. రిలే టీమ్ పి.టి. ఉష, ఎం.డి. వల్సమ్మ, వందనా రావు, షైనీ అబ్రహాంతో కూడిన లాస్ ఏంజెలెస్ గేమ్స్ (1984)లో ఏడవ స్థానాన్ని అందుకున్నది.

అంజలి భగవత్



అంజు బాబీ జార్జ్



సానియా మీర్జా



సాయ్‌నా నేహ్వాల్



పేస్ - భూపతి



**చందమామ క్విజ్-6 (జూలై 2008) సమాధానాలు**

1. ఐ ఎన్ ఎస్ చక్ర; 2. డిసెంబర్ 4; 3. 1948;
4. మానేక్ షా; 5. 1978; 6. ఐఎన్ఎస్ బ్రహ్మపుత్ర;
7. లెఫ్టినెంట్ జనరల్ పంకజ్ జోషీ; 8. పృథ్వీ;
9. 1974-బుద్ధ ఈజ్ స్మైలింగ్-రాజాస్థాన్‌లోని పోఖ్రాన్.



శ్రీ చక్రపాణిగారు

*5 ఆగస్ట్ 1908 – 24 సెప్టెంబర్ 1975*

# నివాళి

అరవై ఒక్క సంవత్సరాల క్రితం శ్రీ బి. నాగిరెడ్డి గారితో కలిసి చందమామను స్థాపించిన శ్రీ చక్రపాణిగారి పేరు చందమామ మూడు తరాల పాఠకులకు చిరపరిచితమే. చందమామ వ్యవస్థాపక సంపాదకులుగా చక్రపాణి గారు చందమామకు కథలు సమకూర్చే గురుతర బాధ్యతను స్వీకరించారు. భాషా సాహిత్యాల అపార పరిజ్ఞానం కారణంగా సరళమైన భాషలో సాహితీ విలువలు గలిగిన ఆకర్షణీయమైన పత్రికగా చందమామను ఆయన తీర్చిదిద్దగలిగారు.

ఆయన స్వయంకృషితో సంస్కృతం, హిందీ, ఇంగ్లీష్, బెంగాలీ భాషలను నేర్చుకున్నారు. బెంగాలీ నవలలను ముఖ్యంగా శరత్ సాహిత్యాన్ని అనువాదం అనిపించని చక్కని తెలుగులో అనువదించి తెలుగు పాఠకులకు అందించారు. ఆయన అనువాద నవలలు చదువుతూ ఉంటే పాఠకులకు బెంగాలీ కుటుంబాల మధ్య ఉన్న అనుభూతి కలిగేది. చందమామ వివిధ భాషలలో ప్రచురించబడి దేశంలోని అన్ని ప్రాంతాలకు చేరడానికి వివిధ భారతీయ భాషల పట్ల చక్రపాణిగారికున్న అభిమానం ఒక కారణం.

తెనాలి ఐతానగరంలో 1908వ సం. ఆగస్ట్ 5వ తేదీ జన్మించిన ఆలూరి వెంకటసుబ్బారావు (చక్రపాణి)గారి శత జయంతి వేడుకలు పలు సాహితీ సంస్థలు దేశవ్యాప్తంగా జరుపుకుంటున్నాయి. చందమామ కూడా వారితో కలిసి చక్రపాణిగారి సాహితీసేవను స్మరిస్తూ నివాళులర్పిస్తున్నది!

–ప్రచురణకర్త



చిరస్మరణీయ చారిత్రక ఘట్టాలు - 12

# మరో వీరకిశోరం

"బ్రిటిష్ అధికారాన్ని ఎదిరించి ధైర్య సాహసాలతో గొప్పగా పోరాడిన రాజపుత్ర వృద్ధ యోధుడు 1858 ఏప్రిల్ 26వ తేదీ మరణించాడు," అని రాశాడు హోమ్స్ తన 'హిస్టరీ ఆఫ్ ది సిపాయ్ వార్' గ్రంథంలో. బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీ శిబిరంలో ఆ రోజు ఆనందోత్సాహాలు వెల్లివిరిశాయి. అజేయుడైన బీహార్ సింహం రాజాకున్వర్ సింగ్ ఆఖరికి పతనమయ్యాడని తెలియగానే వాళ్ళు విపత్కర సమస్య తీరిపోయినట్టు నెమ్మదిగా ఊపిరి పీల్చుకున్నారు. వాళ్ళ మనసులు ఆనందంతో ఉప్పొంగాయి. ఎనభై యేళ్ళ ఆ సాహస యోధుడు వారిని హడలెత్తించాడు. వాళ్ళు రూపొందించిన ప్రతి వ్యూహాన్నీ ఛేదించుకుంటూ, వాళ్ళకు అందీ అందకుండా తప్పించుకుంటూ ముప్పు తిప్పలు పెట్టాడు. అతడి సేనలు ఎప్పుడూ విజయవంతమయ్యాయి. తన 'హిస్టరీ ఆఫ్ ది మ్యూటినీ'లో ఆంగ్లేయ సేనలు దారుణమైన పూర్తి ఓటమి పొందవలసివచ్చింది అని రాశాడు వైట్.

ఇప్పుడు రాజ్యం మీదికి దాడి చేసి వశపరుచుకోవాలని బ్రిటిష్ వాళ్ళు పథకం రూపొందించారు. చిన్న రాజ్యం మీదికి అతి పెద్ద సైన్యం ఆర్భాటంతో బయలుదేరింది. తాము అనుభవించిన అనేక ఓటములకు పగసాధించాలనుకున్నారు. అయితే, దేశభక్తుడూ, ధైర్య సాహసాలు నిండిన యోధుడూ అక్కడ వారిని ఎదుర్కోగలడని వాళ్ళకు తెలియదు. ఆయన వేరెవరో కాదు. కున్వర్ సింగ్ తమ్ముడైన రాజా అమర్ సింగ్. అన్న తరవాత రాజ్యాన్ని కాపాడవలసిన గురుతర బాధ్యతను ఆయన చేపట్టాడు. ఒక్క క్షణం కూడా జాగు చేయకుండా ఆయన తన సేనలను జనరల్ లుగార్డ్ సేనలను ఎదుర్కోవడానికిసమాయత్తం చేశాడు. ఘోర యుద్ధం ఆరంభమయింది. మెల్లమెల్లగా ఆంగ్లేయులదే పైచేయి కాసాగింది. అయితే, హఠాత్తుగా వారికి శత్రుసేనలు అదృశ్యమై పోయినట్టు అనిపించి దిగ్భ్రాంతి చెందారు. కనిపించని సైన్యంతో యుద్ధం చేయడం ఎలా? వ్యూహ రచనలో ఘటికుడైన రాజా అమర్ సింగ్



సైన్యాన్ని చిన్న చిన్న బృందాలుగా విడిపోయి తాము ఎరిగిన వివిధ దిశల కేసి వెళ్ళి పొమ్మన్నాడు. వారి వెంటబడి తరమడం బ్రిటిష్ సేనలకు సాధ్యపడలేదు. అయితే, ముందే ఏర్పాటు చేసుకున్న సంకేతాలకు అనుగుణంగా విప్లవకారులు హఠాత్తుగా ఇనుమడించిన బలంతో బ్రిటిష్ సేనల ముందు ప్రత్యక్షం కావడంతో వాళ్ళు బెంబే లెత్తి పోయారు. రాజా అమర్ సింగ్ ఒకవైపు తప్పించుకునిపోయి మరోవైపు కనిపించే వాడు. ఒకసారి పట్టుబడి ఉన్నట్టుండి గుర్రం మీద అడవిలోకి దూసుకు వెళ్ళేవాడు. మళ్ళీ తిరిగి వచ్చి దురాక్రమణదారులపై దాడి జరిపేవాడు. జనరల్ లుగార్డ్, అతని సైని కులు ఆశాభంగానికి, నిస్పృహకు లోన య్యారు. అతని సేనలు శిబిరానికి వెనుదిరి గాయి. అతడు తన పదవికి రాజీనామా చేసి ఇంగ్లాండుకు తిరిగి వెళ్ళాడు.

తన సేనలను సమీకరించి, మళ్ళీ బలో పేతం చేసుకోవడానికి యువరాజుకు అవ కాశం కలిగింది. వెంటనే శత్రుసేనలను తప్పు దారి పట్టించి, ఆరా మీద జాడి జరిపి, రాజ ధాని జగదీశ్పూర్‌ను చేరుకున్నాడు. ఎత్తయిన కోట బురుజుల మీద స్వతంత్ర పతాకలు రెపరెపలాడాయి. స్వతంత్ర ప్రజలకు యువకు డైన రాజా అమర్ సింగ్ పాలకుడయ్యాడు. సంగతి తెలిసి బ్రిగేడియర్ డుగ్లాస్ ఆయన్ను తుదముట్టించడానికి పదివేల సైన్యంతో బయలుదేరాడు.

మరోవైపు ఎలాగైనా రాజా అమర్ సింగ్ తలను తెచ్చి అప్పగించినవారికి గొప్ప బహు మతులిస్తామని ఆంగ్లేయులు ప్రకటించారు. అయితే అలాంటి దుస్సాహసం చేయగల చేవ ఎవరికి ఉంటుంది? బలహీనులైన తన అనుచరు లకు సైతం తన అసాధారణమైన ధైర్యోత్సాహా లతో, ఉత్తేజాన్ని కలిగిస్తూ ప్రజల మధ్య కున్వర్‌సింగ్ మరణించలేదేమో అన్న అనుమా నాన్ని రేకెత్తించేవాడు రాజా అమర్ సింగ్.

బ్రిగేడియర్ డుగ్లాస్ పెద్ద సైన్యం అడవు లను ఛేదించుకుంటూ, మెల్ల మెల్లగా ముందుకు కదిలింది. బృహత్తర ప్రయ త్నంతో, ఏడు బృందాల సేనలు జగదీశ్పూర్‌ను చుట్టుముట్టాయి. పట్టణానికి వెళ్ళే దారులన్నీ మూయబడ్డాయి. రాజా అమర్ సింగ్ తప్పించుకోలేని స్థితి. రాజధాని మీద బ్రిటిష్ సేనల పట్టు బిగియసాగింది. తప్పించుకోవడానికి వీలుకాకుండా దారుల కడ్డంగా భయంకరమైన మంటలు రగిలిం చారు. మంటలకు ఆవల ఆయుధా లతో సైనికుల కాపలా. తప్పించు



కోవాలంటే ఆకాశంలో ఎగిరి వెళ్ళాలి. అందుకు రాజాకు రెక్కలు లేవు కదా!

రాత్రయింది. తెల్లవారగానే సేనలు కోటలో జొరబడాలని నిర్ణయించారు. సమయం వేగంగా నడుస్తోంది. బ్రిటిష్ శిబిరం నుంచి వచ్చినట్టు ఒక సైనికుడు తెల్లటి గుర్రం మీద వెనుకవైపు ద్వారం గుండా శత్రుసేనల కేసి వచ్చాడు. ఎవరని అడిగినప్పుడు, "బాధ్యతా నిర్వహణలో ఉన్నాను!" అని ముక్తసరిగా సమాధాన మిచ్చాడు. హఠాత్తుగా అతడు ఒక చోట అలాగే ఆగిపోయాడు. దారులన్నీ ఎగిసే మంటలతో మూసుకుపోయాయి. కాలకుండా వాటిని దాటడం అసాధ్యం. అయితే ఆ సైనికుడికి మరో మార్గం కనిపించ లేదు. ఆ మంటల గోడ గుండా దూసుకుపోక తప్పదు. సైనికుడు గుర్రాన్ని చరచగానే అది ఒక్క గెంతున శరవేగంతో మంటల గుండా దూసుకుపోయి ఆవలికి దూకింది. ఏం జరుగుతున్నదో బ్రిటిష్ సైనికులు గ్రహించే లోగా మెరుపులా వీరుడితో సహా గుర్రం చీకటిలో కలిసిపోయింది.

మరునాడు తెల్లవారగానే బ్రిటిష్ సేనలు ఒక్కసారిగా అన్ని దిశల నుంచీ జగదీశ్పూర్‌లో జొరబడ్డాయి. అయినా వాళ్ళు పట్టు కోవాలనుకున్న యువకిశోరం జాడ కనిపించలేదు. అతడు ఎక్కడికి వెళ్ళాడు? ఎలా వెళ్ళాడు? రాత్రి బ్రిటిష్ సైనికుడిలా వెళ్ళిన వాడు అతడేనా? తమ అలసత్వానికి బ్రిటిష్ సైనికులు తమను తామే నిందించుకున్నారు. తప్పించుకున్న యువరాజును పట్టుకోమని అశ్వాల మీది సైనికులను ఆజ్ఞాపించాడు డగ్లాస్.

అడవిని చేరిన రాజా అమర్‌సింగ్ అసరికే బాగా అలిసిపోయాడు. బ్రిటిష్ సైనికులు ఆకలిగొన్న తోడేళ్ళలా ఆయన వెంటబడ్డారు. వాళ్ళ దగ్గరి ఆయుధాలు చాలా బలమైనవి. అయినా అతడు వాళ్ళకు లొంగిపోవాలని కలలో కూడా భావించలేదు. భయంకరమైన సింహంలా పోరాడసాగాడు. నోనాడీ గ్రామంలో నాలుగు వందల మంది సైనికులను చుట్టు ముట్టి పట్టుకున్నారు. వారిలో రాజా అమర్ సింగ్ ఉన్నాడా? లేడా? మూడు వందల మంది సైనికులను బ్రిటిష్ వాళ్ళు కర్కశంగా హతమార్చారు. వంద మంది తప్పించుకుని వెళ్ళి మళ్ళీ వచ్చి శత్రువుల మీద ఆగ్రహం చెందిన పులుల్లా విరుచుకు పడ్డారు. ఆ తరవాత కొత్తగా వచ్చిన సైన్యంతో భీకర యుద్ధం జరిగింది. వంద మంది వీరులలో చివరికి ముగ్గురే మిగిలారు. వాళ్ళూ తప్పిం



చుకోగలిగారు. అంతవరకు మారువేషంలో యుద్ధం చేసిన రాజా అమర్ సింగ్ వాళ్ళల్లో ఒకడు.

ఆ విధంగా జరిగిన మరిన్ని దారుణమైన ఎదురుదాడుల్లో మాతృభూమి పరిరక్షణ కోసం ప్రాణాలొడ్డి వీరోచితంగా పోరాడారు. ఒకసారి అమర్ సింగ్ మారువేషంలో ఏనుగు మీది అంబారీలో పయనిస్తున్నాడు. ఏనుగును చుట్టుముట్టిన శత్రువులు దానిని తరలించుకు వెళుతూండగా రాజా అమర్ సింగ్ హఠాత్తుగా కిందికి దూకి దాపులనున్న అడవిలోకి తప్పించుకున్నాడు. శత్రుసైనికులు అవాక్కయి చూస్తూండి పోయారు.

అంతకుముందే ఆయన అనుచరులు కైమూర్ కొండలను చేరుకున్నారు. ఆ వీరులు సాగిస్తూన్న పోరాటం గురించి తెలుసుకుని స్థానికులు వారి పట్ల గౌరవాదరాలు కనబరచారు. ఆ జిల్లాలోని ప్రజలు వారిని గురించి తప్పుడు సమాచారం అందించి బ్రిటిష్ సైనికులను దారి మళ్ళించారు. అయినా శత్రువులు తమ ప్రయత్నాలను వదిలి పెట్టలేదు. కొండ ప్రాంతాలన్నీ గాలించసాగారు.

ఆ పర్వత ప్రాంతంలోని ప్రతి కొండ, కోన, గుట్ట, బండ ఎదురు దాడులతో ప్రతిధ్వనించాయి. ఒక బృందం మాతృభూమి పవిత్ర స్వతంత్రం కోసం; రెండవ బృందం వలస రాజ్య విస్తరణ కోసం పోరాడాయి. అమర్ సింగ్ అనుచరులు ఒక్కొక్కరుగా బలి అవుతూ వచ్చారు. జగదీశ్‌పూర్ రాజభవనంలోని మహిళలు మానసంరక్షణ కోసం తమ చేతులతోనే తుపాకులు పేల్చుకుని ప్రాణత్యాగం చేశారు.

అయితే రాజా అమర్ సింగ్ మళ్ళీ శత్రువుల నుంచి తప్పించుకున్నాడని చెబుతారు. ఆయన ఎక్కడికి వెళ్ళాడు? ఆయనకు ఏమయింది? చివరి రోజులు ఎక్కడ గడిపాడు? అవన్నీ అంతుబట్టని రహస్యాలుగానే మిగిలిపోయాయి!

అయినప్పటికీ, బ్రిటిష్ వాళ్ళు తిరుగుబాటుదారుల్లో ఆయన పేరుగల ఒక వ్యక్తిని గోరఖ్‌పూర్‌లో పట్టి బంధించారు. అయితే విచారణ జరిపి అతడు ఎవరని నిజం నిర్ధారించే లోపలే ఆ ఖైదీ మరణించాడు.

–(ఎకెడి)





# నమ్మకద్రోహి

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో అయిదు వందలమంది వర్తకులు ఒక నౌకలో సముద్రం మీద పోతూ ఉండగా, నడిసముద్రంలో నౌక మునిగిపోయింది. నౌకలో ఉన్నవారిలో ఒకడు తప్ప అందరూ చేపలకు ఎర అయ్యారు. అందరూ చావగా మిగిలినవాడు కరంబియ అనే సముద్రతీర నగరాన్ని చేరుకుని తిండికోసమూ, బట్టకోసమూ ముష్టి ఎత్తసాగాడు.

అక్కడి ప్రజలు వాడి దుస్థితికి జాలిపడి సమస్తమైన వస్తువులు వాడికి ఇవ్వబోయారు. ''ఇవన్నీ నాకెందుకు? నాకింత బట్టా, తిండీ చాలు!'' అని వాడు, వారిచ్చిన వస్తువులను నిరాకరించాడు. ఇది చూసి ప్రజలు, ''ఓహో, ఇతడెవడో గొప్ప విరాగి, తపస్వి!'' అనుకుని, అతనికొక పర్ణశాల నిర్మించి, అందులో ఉంటూ తపస్సు చేసుకోమన్నారు.

అతను అందులో ఉంటూ, కరంబియ మహాముని అని పేరు పెట్టుకుని, ఎంతో గౌరవ ప్రపత్తులు సంపాదించుకున్నాడు. అతని దర్శనం కోసం రాజులు కూడా రాసాగారు. ఈ విధంగా కరంబియుడి స్నేహం సంపాదించిన వారిలో పాములకు రాజైన పండరకుడూ, గరుడులకు రాజుగా జన్మించిన బోధిసత్త్వుడూ ఉన్నారు.

ఒకనాడు గరుడరాజు వచ్చి, కరంబియుడికి ప్రణామం చేసి, ''స్వామీ, మా గరుడులకూ, పాములకూ యుద్ధం జరిగినప్పుడల్లా పాములకన్న గరుడులే ఎక్కువగా చావటం జరుగుతున్నది. మాకు పాములను ఎలా పట్టాలో తెలియటం లేదనుకుంటాను. ఇందులో ఏదో రహస్యం ఉన్నది. ఆ రహస్యం ఏమిటో మీరు పాముల నుంచి తెలుసుకుని నాకు చెప్పగలరా?'' అని అడిగాడు.

జాతక కథ



కరంబియుడు సరేనన్నాడు. గరుడరాజు వెళ్ళిపోయాడు. తరవాత సర్పరాజు తనను చూడటానికి వచ్చినప్పుడు కరంబియుడు ఆయనతో, ''రాజా, గరుడులు మిమ్మల్ని పట్టుకోగానే చచ్చిపోతాయట. దీని కేమిటి కారణం? ఎలా పట్టుకుంటే మీ సర్పాలు లొంగిపోతాయి?'' అని అడిగాడు.

దీనికి సర్పరాజు వినయంగా జవాబిస్తూ, ''స్వామీ, అది మా రహస్యం. నేను గనక ఈ రహస్యాన్ని బయటపెట్టానో నా జాతి కంతకూ ద్రోహం చేసినవాణ్ణి అవుతాను. జాతి వినాశనానికి కారకుడనవుతాను! కనుక ఆ సంగతి నన్నడగకండి,'' అన్నాడు.

''అదేమిటి? రహస్యాన్ని మరొకరికి చెప్పేస్తానని నువ్వు శంకిస్తున్నావా? అలా ఎన్నటికీ జరగదు. నేను కేవలం ఆ రహస్యం ఏమిటో తెలుసుకుందామనే అడుగుతున్నాను. నాకు చెప్పినందువల్ల నీ జాతికేమాత్రమూ నష్టం కలగదు,'' అని కరంబియుడన్నాడు.

సర్పరాజు కరంబియుడికి రహస్యం చెబుతానని మాట ఇచ్చి సెలవు పుచ్చుకున్నాడు. ఆయన తన దర్శనం కోసం మర్నాడు వచ్చినప్పుడు కరంబియుడు మళ్ళీ అడిగాడు. కాని సర్పరాజు రహస్యం బయట పెట్టలేదు. ఆయన మూడవసారి వచ్చినప్పుడు కరంబియుడు, ''ఇవాళ మూడవసారి అడుగుతున్నాను. మీ రహస్యం చెప్పవు. కారణమేమిటి?'' అని అడిగాడు.

దానికి సర్పరాజు, ''స్వామీ, తమరు ఈ రహస్యాన్ని మరెవరికైనా చెప్పేస్తారేమోనని నాకు భయంగా ఉంది!'' అన్నాడు.

''నేనలా ఎన్నటికీ చెప్పను. చెప్పనని ప్రమాణం చేస్తున్నాను!'' అని కరంబియుడు అన్న మీదట సర్పరాజు తమ రహస్యాన్ని ఈ విధంగా బయటపెట్టాడు:

''మేము పెద్దపెద్ద రాళ్ళను మింగి మా శరీరాలను బరువుగా చేసుకుని పడుకుని వుంటాము. గరుడులు మా మీదికి వచ్చినప్పుడు మేము నోళ్ళు తెరుచుకుని వారిమీద కలియబడతాము. గరుడులు మా తలలను పట్టుకుని గాలిలోకి ఎగురుతారు. మా బరువులు మోయటంచేత వారి శరీరాలలో వుండే నీరంతా పైకి వచ్చేస్తుంది. ఆ కారణంగా చచ్చిపోతారు. మూఢులైన ఆ గరుడులు మా తలలు పట్టుకోవటానికి బదులు మా తోకలు పట్టుకుని గాలిలోకి లేచినట్టయితే మేము

మింగిన రాళ్ళన్నీ కింద పడిపోతాయి. మా శరీరాలు తేలిక అవుతాయి. మమ్మల్ని వారు తన్నుకుపోగలుగుతారు. ఇదే మా రహస్యం!''

సర్పరాజు వెళ్ళిపోగానే గరుడరాజు వచ్చి కరంబియుడితో, ''స్వామీ, సర్పరాజు నుంచి పాముల రహస్యం తెలుసుకున్నారా?'' అన్నాడు. కరంబియుడు సర్పరాజు నుంచి తాను తెలుసుకున్న రహస్యం కాస్తా గరుడ రాజుకు చెప్పేశాడు.

''ఈ సర్పరాజు గొప్ప అపచారం చేశాడు. తన జాతి యావత్తూ నాశనం అయ్యేటందుకు సహాయపడగల రహస్యాన్ని ఆయన మరొకరికి తెలియనిచ్చి వుండగూడదు. నేనిప్పుడే వెళ్ళి ఆయనను పట్టుకుంటాను,'' అంటూ గరుడరాజు తన రెక్కలతో ఝుంఝామారుతాన్ని లేపి, సర్పరాజు తోకను పట్టుకుని ఆకాశం లోకి ఎగిరాడు.

తలకిందుగా వేలాడుతున్న సర్పరాజు తాను మింగిన రాళ్ళనన్నిటినీ కక్కేస్తూ విచారంతో, ''అయ్యో, నా నాశనాన్ని నేను కోరి చేతులారా తెచ్చుకున్నాను గదా! ఆ దుర్మార్గుడు మహాముని అని మోసపోయి, నా రహస్యం కాస్తా చెప్పేశాను,'' అని విలపించాడు.

ఇది విని గరుడరాజు, ''మూర్ఖుడా, నీ రహస్యం ఆ దొంగసన్యాసికి చెప్పేసి ఇంకా ఎందుకు దుఃఖిస్తావు? చావు ఎవరికీ తప్పదు, కాని వివేకం మానవుడి ప్రధాన ధర్మం. నీ దుర్గతికి కారణం నేనూ కాదు, సన్యాసీ కాదు, నీ అవివేకమే. ప్రాణికి తల్లిదండ్రులకన్న ప్రేమపాత్రులుండరు; అలాటి తల్లిదండ్రులకు కూడా నీ రహస్యం చెప్పరాదు. అనేక మంది బంధువులూ, మిత్రులూ వుంటారు. రూపవతి అయిన భార్య వుంటుంది; వారికెవ్వరికీ నీ రహస్యం తెలియనివ్వరాదు. ఆ విధంగా రహస్యం దాచగలిగిన వాడే శత్రువును దూరంగా ఉంచగలుగుతాడు!'' అన్నాడు.



''మహాత్మా, నీ హితబోధ గ్రహించాను. తల్లి తన బిడ్డపైన ఎలాటి కరుణ చూపుతుందో నాపైన అలాటి కరుణ చూపు!'' అని సర్పరాజు గరుడరాజును ప్రార్థించాడు.

''కొడుకులలో మూడు రకాలు: శిష్యులూ, పెంచినవారూ, గర్భవాసాన పుట్టినవారూ. అందులో నువ్వు నాకు శిష్యుడవు, కనుక కొడుకువయ్యావు. అందుచేత నీ ప్రాణాన్ని కాపాడుతున్నాను!'' అంటూ గరుడరాజు సర్పరాజును నేలమీదికి దించి వదలిపెట్టాడు.

సర్పరాజు నాగలోకానికి వెళ్ళాడు. గరుడ రాజు తన లోకానికి వెళ్ళి గరుడులతో, ''సర్ప రాజైన పండరకుణ్ణి మిత్రుడుగా చేసుకున్నాను. కాని అతనికి నా పట్ల ఎలాటి భావం ఉన్నదో పరీక్షించవలసి వున్నది,'' అని చెప్పి, నాగలోకానికి వెళ్ళి తన రెక్కలతో మళ్ళీ ఝుంఝామారుతం లేపాడు. వెంటనే సర్ప రాజు రాళ్ళూ, ఇసుకా మింగి, తోక కనపడకుండా చుట్ట చుట్టుకుని నేలపై పడుకుని, నోరు తెరిచి బుసకొట్టసాగాడు.

అప్పుడు గరుడరాజు, ''ఇదేమి, సర్ప రాజా? మనం సంధీ, స్నేహమూ చేసుకొంటి మిగదా, మళ్ళీ నన్ను చంపటానికి సిద్ధపడుతున్నావేమిటి?'' అని అడిగాడు.

దానికి సర్పరాజు, ''మిత్రమా, వివేకి అయినవాడు ఎవరినీ నమ్మరాదు! అందులో, నిన్నటివరకూ శత్రువుగా ఉండిన నిన్ను ఎలా నమ్మను?'' అన్నాడు.

గరుడరాజు నవ్వి, ''నా పాఠం నాకు బాగానే వప్పగించావు! పద, ఆ దొంగ సన్యాసిని చూసివస్తాం!'' అన్నాడు.

ఇద్దరూ కలిసి కరంబియుడి పర్ణశాలకు వెళ్ళారు. సర్పరాజు కరంబియుణ్ణి చూసి, ''నిన్ను చూసి గొప్ప మునివనుకుని నా రహస్యం చెబితే, దాన్ని గరుడరాజుకు చెప్పి ఎందుకు నమ్మక ద్రోహం చేశావు?'' అని అడిగాడు.

''నేను అజ్ఞానంచేత ఆ పని చెయ్యలేదు. మీరిద్దరూ నాకు మిత్రులే అయినప్పటికీ నాకు గరుడరాజుపైన అభిమానం జాస్తి. అందుచేత నీ రహస్యం గరుడరాజుకు చెప్పేశాను!'' అన్నాడు కరంబియుడు.

''ఛీ, నీచుడా! సర్వసంగాలనూ పరిత్యజించి కూడా పక్షపాత బుద్ధి, శత్రు మిత్ర భావమూ పోని నువ్వు కూడా ఒక మునివేనా? లోకాన్ని ఈ విధంగా వంచిస్తున్నందుకు నీ శిరస్సు ఏడు చెక్కలగుగాక!'' అని సర్పరాజు కరంబియుణ్ణి శపించాడు.

మరుక్షణమే కరంబియుడి శిరస్సు ఏడు చెక్కలయింది. అతని కింద భూమి విచ్చుకున్నది. అతను తిన్నగా అవీచీ నరకానికి దిగిపోయాడు.





# రామాయణం

త్రిజట తన కల గురించి రాక్షసస్త్రీలకు చెబుతూండగా మరోవైపు సీత దుఃఖ వివశు రాలై బెంబేలు పడిపోయింది. ఎటు చూసినా ఆమెకు ఆశ అన్నది లేదు. రావణుడో, రాక్షస స్త్రీలో తనను తప్పక చంపుతారనీ, తాను రాముడి కొరకు ఇంత కాలమూ ఎదురు చూడటం నిష్ప్రయోజన మయిందనీ ఆమె అనుకున్నది. నోరెండిపోతూ ఆమె శింశుపా వృక్షం కిందికి పోయి, ఆత్మహత్య చేసుకునే ఆలోచన చేస్తూ తన జడను మెడకు చుట్టుకు న్నది. అంతలోనే ఆమెకు శుభ శకునాలు కలిగాయి. ఆమె ఎడమ కన్ను గట్టిగా అదిరింది, ఎడమ భుజం అదిరింది, ఎడమ తొడ అదిరింది. ఈ శుభ శకునాలు చూసి ఆమెకు కొత్త ప్రాణం వచ్చినట్టయింది.

ఇంతసేపూ శింశుపా వృక్షంలో కూర్చుని ఉన్న హనుమంతుడు అంతా చూశాడు. అన్నీ విన్నాడు. కాని అతనికి ఏం చెయ్యటా నికీ ఒకంతట పాలుపోలేదు. తాను రాముడి వార్త సీతకు చెప్పి, ఆమె సందేశం రాముడికి అందించాలి. సీతతో మాట్లాడకుండానే తిరిగి పోతే సీతకు రాముడి విషయం తెలియదు; ఆమె ఇక్కడి బాధలు భరించలేక ఆత్మహత్య చేసుకోవచ్చు. అదీ గాక, ''సీత ఏమన్నది?'' అని రాముడు తప్పక అడుగుతాడు. ''నేనా మెతో మాట్లాడలేదు,'' అంటే రాముడు తన చూపులతోనే నన్ను దగ్ధం చేస్తాడు. పోనీ సీతతో మాట్లాడతామంటే రాక్షస స్త్రీలంతా ఉన్నారు. పైగా, సీత తనను చూసి రావణుడే మాయా రూపంలో వచ్చాడనుకుంటుందేమో! అప్పు

సుందరకాండ - 4



డామె భయపడి కెవ్వున అరవగానే రాక్షస స్త్రీలు తన పైకి ఆయుధాలతో వస్తారు. తన చేత దెబ్బలుతిని వాళ్ళు రాక్షస యోధులను పిలుచుకు వస్తారు. వాళ్ళతో యుద్ధం చేసి అలసిపోతే తాను మళ్ళీ నూరు యోజనాల సముద్రం లంఘించలేక పోవచ్చు. ఒక వేళ తాను రాక్షసుల చేతిలో చావటమే జరిగితే సీత వార్త చెప్పేవాడుండడు.

"నేను చెప్పే మాటలు సీత ఆలకించాలి, కాని ఆమె నన్ను చూసి భయపడగూడదు. అలా మాట్లాడే మార్గమేది?" అని హనుమంతుడు దీర్ఘంగా ఆలోచించి అందుకొక మంచి మార్గం కనిపెట్టాడు. అతను చెట్టు కొమ్మల మాటున సీతకు కనిపించకుండా కూర్చుని, ఆమెను చూస్తూ ఆమెకు వినిపించేలా ఇలా ప్రారంభించాడు:

"దశరథుడనే ఒక గొప్ప రాజు. ఆయన జ్యేష్ఠపుత్రుడు రాముడు మిక్కిలి అందమైన వాడు, గొప్ప విలుకాడు. తండ్రి ఆజ్ఞచేత ఆ రాముడు భార్యనూ, తమ్ముణ్ణీ వెంట బెట్టుకుని అరణ్యాలకు వెళ్ళాడు. అక్కడ అతను ఖరుడు మొదలైన అనేక రాక్షసులను చంపాడు. ఈ సంగతి తెలిసి రావణుడు మాయలేడి సహాయంతో రాముణ్ణి మోసపుచ్చి, అతడి భార్య అయిన సీతను అపహరించాడు. రాముడు సీతను వెతుకుతూ వచ్చి, సుగ్రీవుడనే అతనితో స్నేహం చేసి, వాలి అనే వానర రాజును చంపి, ఆ రాజ్యాన్ని సుగ్రీవుడికిచ్చాడు. ఆ సుగ్రీవుడు సీతాదేవిని వెతకటానికి అన్ని దిక్కులకూ వేలకువేల వానరులను పంపాడు. ఆ ప్రయత్నంలో నేను నూరు యోజనాల సముద్రాన్ని లంఘించి ఈ లంకకు వచ్చి, రాముడు వర్ణించిన సీతను చూడగలిగాను."

హనుమంతుడీ మాటలని మౌనం వహించగానే సీత ఆశ్చర్యంతోనూ, సహజమైన భయంతోనూ తల ఎత్తి శింశుపా వృక్షం కేసి చూసింది. ఆమెకు హనుమంతుడు కనిపించాడు. సీత తన కళ్ళనూ, చెవులనూ, తానే నమ్మలేక, తాను కలగంటున్నాననీ, కలలో కోతి కనిపించటం చాలా చెడ్డదనీ భయపడింది. తరవాత ఆమె తాను కలకనటం లేదని రూఢిచేసుకుని, భ్రమపడుతున్నాననుకున్నది.

ఈలోపల హనుమంతుడు చెట్టుదిగి వచ్చి, కొంతదూరంలో నిలబడి నమస్కారం చేసి, "అమ్మా, జీర్ణించిన పట్టుచీరె కట్టుకుని,



చెట్టుకొమ్మ పట్టుకుని నిలబడి ఉన్నావు, నువ్వెవరవు? ఏ జాతికి, ఏ గణానికి చెందిన దానివి? నిన్ను చూస్తే దేవతవనిపిస్తున్నది. నీ తండ్రి ఎవరు? భర్త ఎవరు? పెద్ద దుఃఖంలో ఉన్నావు, నీ బంధువు ఎవరైనా పోయారా? జనస్థానం నుంచి రావణుడు అపహరించి తెచ్చిన సీతవే అయితే ఆ మాట వెంటనే చెప్పు,'' అన్నాడు.

సీత హనుమంతుణ్ణి చూసి, ''నేను దశరథుడి కోడలిని, జనకుడి కూతురిని, రాముడి భార్యను. నా పేరు సీత అంటారు. నేను కాపరానికి వచ్చిన పదమూడో ఏట నా భర్తకు రాజ్యాషేభికం జరగనుండగా, దశరథుడి భార్య అయిన కైకేయి అనే ఆమె రామ పట్టాభిషేకం చేస్తే తాను ప్రాణత్యాగం చేస్తాననీ, రాముణ్ణి వనవాసం పంపెయ్యమనీ కోరింది. తండ్రి యాచించిన మీదట రాముడు తాను పుచ్చుకోనున్న రాజ్యాన్ని తిరిగి తండ్రికి ఇచ్చివేశాడు. అతను నారబట్టలు కట్టుకుని వనవాసం పోతూ నన్ను తన తల్లి అయిన కౌసల్య వద్ద ఉండమన్నాడు. నేను రాముణ్ణి విడిచి ఉండలేక వెంట బయలుదేరాను. నా కన్న ముందే నారబట్టలు కట్టి బయలుదేరాడు లక్ష్మణుడు. మేము దండకారణ్యంలో ఉండగా దుర్మార్గుడైన రావణుడు నన్ను ఇక్కడికి తెచ్చాడు. ఆ రావణుడు నన్నింకా రెండు నెలలు బతకనిస్తాడు, ఆ తరవాత నా ప్రాణాలు తీస్తాడు,'' అన్నది.

సీత దుఃఖం చూసి హనుమంతుడికి కూడా దుఃఖం వచ్చింది. అతను ఆమెకు దుఃఖోపశమనం కలిగేటట్టుగా, ''సీతాదేవీ, రాముడి దూతగా నేను నీ వద్దకు వచ్చాను. రాముడు తన క్షేమం నీకు చెప్పి, నీ క్షేమం తెలుసుకు రమ్మన్నాడు. లక్ష్మణుడు నీకు సాష్టాంగ నమస్కారం చేశాడు,'' అని చెప్పాడు.

ఈ మాటలు వినగానే సీతకు శరీరమంతా పులకరించింది. ''మనిషి బ్రతికి ఉండాలే గాని నూరేళ్ళకైనా ఆనందం కలగకపోదంటారు. అది నా విషయంలో నిజమయింది,'' అన్నదామె.

సీతకు తనపై నమ్మకం కుదిరిందనుకుని హనుమంతుడు ఆమెను సమీపించాడు. ఇది చూసి సీత, రావణుడే వానర రూపంలో వచ్చాడని అనుమానించి, అతనితో ఆత్మీయంగా మాట్లాడినందుకు భయపడుతూ, అశోకవృక్షం కొమ్మ విడిచి నేలపై చతికిల



బడింది. తనకు నమస్కారం చేస్తున్న హనుమంతుడి ముఖం చూడటానికి కూడా ఆమెకు ధైర్యం చాలలేదు. ఆమె హనుమంతుడితో, ''నువ్వు నిజంగా రావణుడవే. ఇప్పుడీ కోతి రూపంలో వచ్చావు. ఆ నాడు సన్యాసి రూపంలో వచ్చావు. నేనసలే దుఃఖంతోనూ, ఉపవాసాలతోనూ కృశించి ఉన్నాను. నన్నిలా మరింత బాధపెడుతున్నావెందుకు? ఇది నీకు మంచిదికాదు. ఒకవేళ నువ్వు నిజంగా రామదూతవే అయితే రాముడి గుణగణాలు వర్ణించు. అతడి గుర్తులు చెప్పు. రాముడితో నీకెప్పుడు సంబంధం కలిసింది? నువ్వు రామలక్ష్మణుల నెలా ఎరుగుదువు? నర వానరులకు పొత్తు ఎలా కుదిరింది?'' అని అడిగింది.

హనుమంతుడు రాముడి గుణగణాలు వివరించాడు. రాముణ్ణి ఆపాదమస్తకమూ వర్ణించాడు. సీతాపహరణానంతరం రామలక్ష్మణులు ఋశ్యమూక పర్వత ప్రాంతానికి వచ్చినది మొదలు తాను లంకకు వచ్చిన దాకా జరిగినదంతా పూసగుచ్చినట్టు సీతకు చెప్పాడు. తాను హనుమంతుణ్ణనీ, సుగ్రీవుడి మంత్రిననీ తెలిపి రాముడిచ్చిన ముద్రికను సీత చేతిలో పెట్టాడు.

సీతకు హనుమంతుడియందు నమ్మకం కుదిరింది. ఆమె ముఖం విప్పారింది. ఆమె ఆంజనేయుణ్ణిపొగుడుతూ, అతడు మామూలు కోతి కాడనీ, ఎంతో శక్తిసామర్థ్యాలుండబట్టే సముద్రం దాటి రాగలిగాడనీ, రావణుడు కూడా అతణ్ణి ఏమీ చేయలేడనీ అన్నది. అప్పటికప్పుడే ఆమె రాముడు వచ్చి తనను రక్షిస్తాడనీ, అయోధ్య నుంచి భరతుడు కూడా వానరసేనకు తోడుగా ఒక అక్షౌహిణి సేనను పంపుతాడనీ, రామలక్ష్మణులు సపరివారంగా రావణుణ్ణి యుద్ధంలో హతమార్చుతారనీ కలలు కన్నది. మరి కొంత సేపటికి రాముడు తనను తీసుకుపోతాడో పోడో అన్న అనుమానం కూడా ఆమెకు కలిగింది; తీసుకుపోకపోతే ఇక్కడే ప్రాణత్యాగం చేయ నిశ్చయించుకున్నది.

రాముడు అస్తమానమూ సీతనే స్మరిస్తూంటాడనీ, ఆమె వెళ్ళిపోయిన తరవాత అతను సరిగ్గా ఆహార పానీయాలు తీసుకోవడం కూడా మానేశాడనీ, సీత ఇక్కడ ఉన్నదని తెలియగానే వచ్చి వాలుతాడనీ హనుమంతుడు చెప్పాడు. తనకు రావణుడిచ్చిన ఏడాది గడువులో పది నెలలు నిండవచ్చాయనీ,

మిగిలిన రెండు మాసాలలోగా రాముణ్ణి రమ్మని చెప్పమనీ సీత హనుమంతుడితో అన్నది. ఆమె హనుమంతుడితో ఇంకొక ముఖ్య విషయం కూడా చెప్పింది: లంకలో సీత పక్షం వహించిన వారున్నారు; వారిలో విభీషణుడూ, అతని భార్యా, అతని పెద్ద కూతురు నలా, అవింధ్యుడనే ఒక రాక్షసుడూ ఉన్నారు.

హనుమంతుడు సీతతో, ''అమ్మా, నువ్వింక ఒక్క క్షణంకూడా దుఃఖించనవసరంలేదు. నా వీపు పైన ఎక్కు, ఒక్క క్షణంలో సముద్రాన్ని దాటేస్తాను,'' అన్నాడు.

హనుమంతుడు చిన్న ప్రమాణంలో ఉండటం చూసి సీత అతని మాటలు నమ్మలేక, ''నువ్వేమిటి? నన్ను వీపున ఎక్కించుకుని సముద్రం దాటటమేమిటి? మొత్తానికి కోతి వనిపించావు,'' అన్నది.

ఈ మాట హనుమంతుడికి అవమానమయింది. అతను సీతకు కొంచెం ఎడంగా వెళ్ళి తన శరీరాన్ని భయంకరంగా పెంచాడు. అతని శరీరం మండుతున్నట్టు కాంతి వంతంగా కనబడింది. ''సీతాదేవీ, నిన్నే కాదు; ఈ లంకనంతా పాదుతో సహా పెరికి తీసుకుపోగలను. అందుచేత భయపడక నా వెంబడి వచ్చెయ్యి,'' అన్నాడతను.

కాని సీత అభ్యంతరాలు చెప్పింది. తనను వీపున ఎక్కించుకుని సముద్రం మీదుగా బయలుదేరగానే సాయుధులైన రాక్షసులు చుట్టు ముట్టుతారనీ, తాను భయపడి సముద్రంలో పడిపోవచ్చుననీ, అందువల్ల తనకూ,



హనుమంతుడికీ కూడా అపాయం కలగ వచ్చుననీ, ఒకవేళ హనుమంతుడే రాక్షసుల నందరినీ చంపినా అందువల్ల రాముడికి అపకీర్తి వస్తుందనీ, అందుచేత హనుమంతుడు వెంటనే తిరిగి వెళ్ళి రాముణ్ణి తీసుకురావ టమే మేలనీ అన్నది. హనుమంతుడు పర పురుషుడు గనక అతడి శరీరాన్ని తాకటానికి తన కభ్యంతరం వున్నట్టు సీత సూచన ప్రాయంగా పరోక్షంగా తెలియజేసింది.

హనుమంతుడీ అభిప్రాయాన్ని గ్రహించి, ''పరపురుషుడినైన నా వీపుపై ఎక్కటానికి నీ కభ్యంతరం ఉండటం భావ్యమే. నిన్ను నేను చూసినట్టు గుర్తుగా రాముడికి ఏమైనా ఇయ్యి,'' అన్నాడు.

రాముడికి గుర్తుగా ఉండగలందులకు సీత హనుమంతుడితో ఒక పాత సంఘటన చెప్పింది. ఈ సంఘటన చిత్రకూట పర్వతం వద్ద గంగాతీరాన ఒక ఋష్యాశ్రమంలో సీతా రాములుండగా జరిగింది. ఒకనాడు సీత అక్కడి పుష్పవనంలో విహరించి అలసిపోయి రాముడి తొడపై కూర్చున్నది. అప్పుడొక కాకి వచ్చి సీత రొమ్ముమధ్య పొడిచింది. సీతకు కోపం వచ్చి, మంటిబెడ్డతో దాన్ని తరిమింది. కాని ఆ కాకి వెళ్ళిపోక మాటిమాటికీ సీత మీదికి రాసాగింది. కాకి చేత అవస్థపడు తూండే సీతను చూసి రాముడు హేళన చేసి, కోపం తెప్పించి తరవాత ఆమెను ఓదార్చాడు. తరవాత సీత రాముడి తొడపై తల పెట్టుకుని చాలా సేపు నిద్రపోయింది. ఆమె నిద్రలేవ గానే రాముడు ఆమె తొడపై తల పెట్టుకుని తాను కూడా నిద్రపోయాడు. ఆ కాకి తిరిగి వచ్చి సీతను మళ్ళీ రొమ్ములో గీరి వేధించ సాగింది. ఆమెకు పెద్ద గాయమై రక్తం కారి రాముడు కూడా తడిశాడు.

ఆఖరికి కాకి బాధ భరించలేక సీత రాముణ్ణి నిద్ర లేపింది. రాముడు నిద్ర లేచి, సీత రొమ్మున గాయం చూసి మండిపడుతూ, ''ఇంతగా నిన్ను గాయపరిచిన దుర్మార్గు డెవరు?'' అని అడిగాడు. అతను అటూ ఇటూ చూసే సరికి గోళ్ళనిండా నెత్తురుతో కాకి కనిపించింది. రాముడు దర్భాసనం నుంచి ఒక దర్భను లాగి బ్రహ్మాస్త్రం పఠించాడు. ఆ దర్భ ప్రళయాగ్ని లాగా ప్రజ్వరిల్లుతూ కాకి పైకి వెళ్ళింది.





# అడ్డుగోడ

నాయుడుగారు చాలా సంపాదించాడు. అదంతా ఆయన కష్టార్జితం. అందుచేత ఆ డబ్బు దుబారా కావటం ఆయనకు ఇష్టం లేదు. ఆయన ఇంటి ఖర్చు ప్రతి దమ్మిడీ కూడా తన చేతి మీదుగానే చేసేవాడు. ఇలా ఉండగా నాయుడిగారి వంటమనిషిపని మాను కుని, ఊరు వెళ్ళిపోయింది. నాయుడుగారికి మరో వంటమనిషి అవసరమయింది.

ఎవరో పంపినట్టుగా ఒక నడివయసు ఆడమనిషి వచ్చి, ''నా పేరు సావిత్రి. వంట పని చెయ్యటానికి వచ్చాను. మీ పాత వంట మనిషే నన్ను పంపింది,'' అన్నది.

మనిషి శుచిగానూ, శుభ్రంగానూ ఉన్నది. నాయుడుగారు ఎంతో తృప్తి పడి, ''రోజూ మిగిలిపోయే అన్నం నువ్వు తీసుకుపోతావా, పనిమనిషిని తీసుకుపోనిస్తావా?'' అని అడి గాడు.

సావిత్రి నవ్వి, ''నేను వంట చేస్తే అన్నం మిగిలే ప్రసక్తి ఉండదు. ఎంతమంది కైనా తూచినట్టు వంట చెయ్యగలను,'' అన్నది.

ఆమె పొదుపు నాయుడుగారికి తృప్తిగా ఉండటంచేత, ఆయన సావిత్రితో, ''ఈ పూట వంట చెయ్యి. రేపటినుంచీ పనిలో చేరుదువుగాని,'' అని సావిత్రిని తన భార్యకు అప్పజెప్పి, తాను పని మీద వెళ్ళిపోయాడు.

''ఉద్యోగం ఇచ్చేవరకే ఆయన ప్రమేయం. ఆపైన నాదే అధికారం. ఇంటిగుట్టు బయట పెట్టావో నీ ఉద్యోగం ఊడుతుంది!'' అన్నది నాయుడుగారి భార్య సావిత్రితో.

ఆ ఇంటి గుట్టు ఏమిటో సావిత్రికి త్వర లోనే తెలిసిపోయింది. నాయుడుగారు కష్టపడి డబ్బు సంపాదిస్తాడు. ఇంట్లో ఎవరికీ ఏ లోటూ రానియ్యడు. అయినా ఇంట్లో ఎవరికీ ఆయన అంటే ప్రేమలేదు. అందుకు

25-ఏళ్ళనాటి చందమామ కథ



కారణం, ఆయన ఎవరినీ నమ్మి ఒక్క పైసా ఇయ్యడు. తండ్రి ఇంటి నుంచి అవతలికి పోగానే పిల్లలు చిరుతిళ్ళకనీ, చిన్న చిన్న వస్తువులకనీ తల్లిని డబ్బు అడుగుతారు. వాళ్ళ కోసం ఆవిడ ఇంటికి తెచ్చిన సరుకులు చాటుగా అమ్మి ఆ డబ్బు తన దగ్గిర ఉంచుకు నేది. ఇందుకోసం ఆమె నాయుడుగారి చేత ఇంటి అవసరాలకు మించి సరుకులు కొనిపించేది.

ఈ రహస్యం తెలుకున్న సావిత్రి ఉండ బట్టలేక నాయుడుగారి భార్యతో, ''అవస రానికి రెట్టింపు సరుకులు కొనిపిస్తున్నారు గదా, బాబుగారికి తెలిస్తే నేనే దుబారా చేస్తున్నాననుకుంటారేమో?'' అన్నది.

''నీకా భయం అక్కర్లేదు. ఆయన ఖర్చు పెట్టేశాక, ఆ ఖర్చు గురించి మళ్ళీ ఆలోచిం చరు!'' అన్నది నాయుడుగారి భార్య. కాని సావిత్రికి ఇంటి పరిస్థితి ఏమీ నచ్చలేదు.

ఒక రోజు ఎందుకో పనిమనిషి రాలేదు. నాయుడుగారి భార్య ఆ రోజే తెచ్చిన నాలుగు వీశెల నెయ్యిలో సగం ఒక గిన్నెలో పోసి సావిత్రికి ఇచ్చి, పెరటి దోవన వెళ్ళి నెయ్యి అమ్మి డబ్బు తీసుకురమ్మన్నది.

సావిత్రి నెయ్యి అమ్మి డబ్బూ, గిన్నే తీసు కుని తలవాకిలిగుండా ఇంట్లోకి వచ్చింది. ముందు గదిలో నాయుడుగారుంటాడని ఆమెకు తెలుసు. ఆమె నెయ్యి అమ్మగా వచ్చిన డబ్బు నుంచి ఒక నాణెం తీసి నాయుడుగారికిచ్చి, ''ఇది సత్తు నాణెం కాదు కదా, బాబూ? చూడండి!'' అన్నది.

నాయుడుగారు నాణాన్ని మోగించి చూసి, ''ఇది చెల్లే నాణెమే! ఇంతకూ ఇది నీ దగ్గిరికి

ఎలా వచ్చింది?'' అన్నాడు. ''నెయ్యి అమ్మగా కొట్టువాడు ఇచ్చాడు!'' అని, నాలుక కరుచుకున్నది సావిత్రి.

''నెయ్యి అమ్మడం ఏమిటి?'' అని నాయుడుగారు అయోమయంగా అడిగాడు.

సావిత్రి భయం అభినయిస్తూ జరిగినది చెప్పి, ''ఇది రోజూ జరుగుతున్నదే గదా!'' అన్నది. నాయుడుగారు ఉగ్రుడైపోయి, భార్యను పిలిచి, నానా చివాట్లూ పెట్టాడు. ఆమె సావిత్రిని ఉరుముతూ చూసింది. ''జవాబు చెప్పవేం?'' అంటూ భార్యమీద చేయెత్తాడు నాయుడుగారు.

''ఆగండి, బాబుగారూ! అసలు తప్పు మీదే! అమ్మగారికి తరచు డబ్బు ఇస్తూ ఉంటే, ఈ విధంగా చేసేవారా? ఇంట్లో ఆడవాళ్ళకు ఖర్చులేవీ ఉండవనుకోకండి. పిల్లలు చిరుతిళ్ళకు డబ్బు అడుగుతారు! తలవని తలంపుగా ఇంటికి కావలసిన వస్తువేదో వీధిలో అమ్మకానికి వస్తుంది. ప్రతిదానికీ భర్తను అడగాలంటే వీలుపడకపోవచ్చు. కాని అమ్మగారు చేసిన పని కూడా మంచిది కాదు. ఆమె చేసిన పనివల్ల పిల్లల దగ్గిరా, పనివాళ్ళ దగ్గిరా చులకనైపోయారు. ఒకరిదాకా ఎందుకు? నా భర్త నాకు అప్పుడప్పుడూ కొంత డబ్బు ఇస్తూ వచ్చినట్టయితే, నాకు ఈ వంటలక్క పని తప్పేది. ఈ ఇంటిగుట్టు బయట పెట్టినందుకు నా ఉద్యోగం ఊడిందని తెలుసు,'' అంటూ సావిత్రి డబ్బులు నాయుడుగారి కిచ్చి వెనుతిరిగింది.

కాని ఆమె వాకిలి దాటేలోపల, ''సావిత్రీ, రేపు మామూలు వేళకు వచ్చెయ్యి,'' అంటూ భార్యాభర్తలిద్దరూ కేక పెట్టారు. వాళ్ళలో మార్పు వచ్చినందుకు సంతోషిస్తూ సావిత్రి, మంచంలో పడి ఉన్న తన భర్తకోసం బత్తాయి పళ్ళూ అవీ కొని ఇంటికి వెళ్ళింది.

ఆమె పండు ఒకటి ఒలిచి భర్తకిస్తూ, ''నువ్వు కాళ్ళూ, చేతులూ కదప లేక మంచాన పడినా ఇవాళ చక్కగా ఉపయోగపడ్డావు. నీ పేరు చెప్పి ఒక భార్యా భర్తల మధ్య అడ్డుగోడ తొలగించాను,'' అన్నది.

సావిత్రి జరిగినదంతా చెప్పగా, ఆమె భర్త కూడా ఆనందించాడు.



మన వారసత్వ స్థలాలు

# పట్టడక్కల్



కర్ణాటక రాష్ట్రం బిజాపూర్ జిల్లా క్రీ.శ. 543-757 మధ్యకాలంలో రెండు శతాబ్దాల పాటు చాళుక్య సామ్రాజ్యంలో అంతర్భాగంగా ఉండేది. బాదామి రాజధానిగా పాలన సాగించారు. కొంత కాలం చాళుక్యులు ఆక్రమించారు. విక్రమాదిత్యుడు వారిని ఓడించాడు. నూతన రాజధాని పట్టడక్కల్ (మాణిక్యకిరీట నగరం) స్థాపన జరిగింది.

చాళుక్యులు గొప్ప కళాపోషకులు. వారి ఆలయ నిర్మాణ కళ, బండలను తొలచి నిర్మించే దశ నుంచి నిర్దిష్ట రూప నిర్మాణానికి పరిణతి చెందింది. రేఖ, నాగర, ప్రాసాద, విమానశైలుల సమ్మేళనంతో ఆలయాలు నిర్మించబడ్డాయి. విమానశైలి దక్షిణాదికి చెందినది. ఇండో-ఆర్యన్ నాగరశైలి ఉత్తర భారతదేశానికి చెందినది.

బాదామికి 22 కి.మీ. దూరంలోని పట్టడక్కల్‌లో పది ఆలయాల సముదాయం ఉన్నది. వాటిలో ఎక్కువ భాగం శివాలయాలే. వాటిలో రెండవ విక్రమాదిత్యుడి భార్య రాణి లోకమహాదేవి నిర్మించిన విరూపాక్ష మందిరం ప్రధానమైనది. ఇక్కడి నటరాజ, ఉగ్రనరసింహ, లింగోద్భవ శిల్పాలు చాలా ప్రసిద్ధి చెందాయి. ఇది ఎల్లోరాలో రాష్ట్రకూటులు నిర్మించిన కైలాసనాథ ఆలయానికి నమూనాగా నిలిచింది. విక్రమాదిత్యుడి మహారాణి త్రైలోక్యమహాదేవి నిర్మించిన మల్లికార్జున మందిరం విరూపాక్ష ఆలయానికి సంక్షిప్త రూపం. గల్గనాథ ఆలయంలో శివుడు అంధకాసురుణ్ణి సంహరించే శిల్పం ఉన్నది. తాదా సిద్ధేశ్వర ఆలయంలో త్రిశూలపాణి శివరూపం దర్శనమిస్తుంది. ఆలయమూ, జంబులింగ ఆలయమూ అయిహోల్‌లోని నాగరశైలిలో నిర్మించబడ్డాయి. పాపనాథ ఆలయ నిర్మాణం నాగరశైలిలో ప్రారంభించి ద్రావిడశైలికి మార్చినట్టు చెబుతారు. రామాయణ, మహాభారత దృశ్యశిల్పాలతో ఈ ఆలయం ప్రసిద్ధిగాంచింది.

1987లో యునెస్కో పట్టడక్కల్ ఆలయాలకు ప్రపంచ వారసత్వ అంతస్థు కల్పిస్తూ- వీటిని ఉత్తర-దక్షిణ భారత ఆలయ నిర్మాణ రూపాల సామరస్య సమ్మేళనంగా పేర్కొన్నది.



# తిరుపెమ్మ - తిరుపాలు

ఒకనాటి మిట్టమధ్యాహ్నం వేళ ఒక సాధువు పట్టణానికి వెళ్ళే దారిగుండా నడుస్తూ బాగా అలిసిపోయాడు. బాటపక్కన పాడుపడిన సత్రం కనిపించడంతో కాస్సేపు విశ్రాంతి తీసుకుందామని సత్రం అరుగు మీద కూర్చున్నాడు. పక్కనే ఉన్న పెద్ద మర్రిచెట్టు నుంచి చల్లటి గాలి వీచడంతో నడుంవాల్చిన ఆయనకు చిన్న కునుకు పట్టింది. కాస్సేపటికి ఉన్నట్టుండి ముఖం మీద ఎవరో నీళ్ళు కుమ్మరించినట్టనిపించడంతో సాధువు ఉలిక్కిపడి లేచాడు.

పక్కనున్న బావిలో బొక్కెనతో నీళ్ళు తోడి సాధువు ముఖం మీదపోసినరెండు దెయ్యాలు -సాధువుకు నిద్రాభంగం కావడంతో ఆనందంతో పళ్ళికిలిస్తూ గెంతసాగాయి. సాధువు ఆగ్రహాన్ని అపుకుంటూ, ''మీకు నేనేం అపకారం చేశాను. నాపట్ల ఎందుకిలా ప్రవర్తించారు? నిద్రలో ఉన్నవారిని లేపడం పాపం అని తెలియదా?'' అన్నాడు.

''పాపం పుణ్యం మేమెరుగం. ఎదుటి వారిని ఏడిపించడంలోనే మాకు ఆనందం. మా ఆనందం, మా ఇష్టం. అడగడానికి నువ్వెవరు?'' అన్నాయి దెయ్యాలు ఒక్కసారిగా.

''నేనెవరినా? మీరు చేసిన దుండగానికి మిమ్మల్ని నరకయాతనకు గురిచేయగలను. నా మంచితనం వల్ల ఊరుకున్నాను. ఇకనైనా బుద్ధిగా ఉండండి,'' అన్నాడు.

''అరరే... బెదిరించడం నీకు గొప్పగా వచ్చే... నీ చేతకానితనాన్ని మంచితనం అంటూ కోతలు కోస్తున్నావా? నీలాంటి వారిని మేమెంతమందిని చూడలేదు,'' అంటూ మగదెయ్యం హేళనగా నవ్వింది.

''నీ మంచితనాన్ని కొంతసేపు పక్కనబెట్టి మమ్మల్నేం చేస్తావో చెయ్ చూద్దాం,'' అంటూ

గుండ్రాతి సుబ్రహ్మణ్యంగౌడు



ఫలించి తీరుతాయి. జనానికి మంచే చేస్తారో, కీడే చేస్తారో ఇక మీరే నిర్ణయించుకోండి,'' అని చెప్పి తనదారిన వెళ్ళిపోయాడు.

దెయ్యాలు ఒకదాన్నొకటి చూసుకున్నాయి. బతికి ఉండగా అవి భార్యాభర్తలు. తిరుపెమ్మ, తిరుపాలు వాటి పేర్లు. ఎదుగూ బొదుగూ లేని బతుకులతో వాళ్ళ మనసులు అసూయాద్వేషాలతో నిండి ఉండేవి. ఎవరైనా పచ్చగా ఉంటే కళ్ళ చూసేవాళ్ళు కారు. అత్తాకోడళ్ళ మధ్య, స్నేహితుల మధ్య పుల్లలు పెట్టి తమాషా చూసేవాళ్ళు. తీరని కోరికలతో అర్ధంతరంగా చనిపోయి దెయ్యాలయ్యాక వాటి దుష్టస్వభావం మరింత ఎక్కువై ఎదుటి వారిని ఏడిపించి ఆనందిస్తున్నాయి.

ఆడదెయ్యం సాధువు పొడవాటి గడ్డాన్ని పట్టి కిందికి గుంజి ఆయన చుట్టూ చప్పట్లు కొడుతూ గెంతులు వేయసాగింది.

దెయ్యాల ఆగడం సాధవులో పట్టుదలను పెంచింది. ఆయన తల పంకిస్తూ, ''నేను సాధకుణ్ణి. నేను మంచితనాన్ని వదలకుండానే మీ చర్యలను కట్టడి చేయగలను. ఈ రోజు నుంచి మీరెవరికి కీడు తలపెట్టినా వారికి మేలే జరుగుతుంది. మంచి చేస్తే కీడు జరగుతుంది. కీడు చేసినా, మేలు చేసినా మీకు పుణ్యం వస్తుంది. ఎందుకంటే కీడు చేసినా మేలు జరిగినందుకు; కీడు జరిగినా మీ ఉద్దేశం మంచిదయినందుకు. ఆ పుణ్యంవల్ల మీకు జన్మవిముక్తి సిద్ధిస్తుంది. ఆ క్షణాన్నుంచి జనానికి మీ బాధలు తొలిగిపోతాయి. ఎన్నడూ అసత్యమాడని నా పలుకులు

దెయ్యాలు సాధువు మాటలు లెక్కచెయ్యకుండా మర్రిచెట్టు మీదికి వెళ్ళి ఏడిపించడానికి ఎవరైనా రాకుండా పోతారా అన్న ఆశతో ఎదురు చూడసాగాయి.

మరుసటి రోజు సాయంకాలం రైతు దంపతులిద్దరు దారిన వెళుతూ మార్గాయాసం తీర్చుకోడానికి మర్రిచెట్టు సత్రం అరుగు మీద కూర్చున్నారు. వాళ్ళ ఒక్కగానొక్క కూతురికి పట్నంలో సంబంధం కుదిరింది. పెళ్ళికి ముందుగానే వెయ్యి వరహాల కట్నం ఇవ్వాలన్నారు. అబ్బాయి చక్కగా ఉన్నాడు గనక, అది తమ తాహతుకు మించినదని తెలిసినప్పటికీ, పిచ్చుకల్లా చాలాకాలం పొదుపు చేసిన సొమ్మును, ఆ యేడు పంట రాబడితో కలుపుకుని ఇవ్వడానికి పెళ్ళికొడుకు ఇంటికి వెళుతున్నారు. తెచ్చుకున్న రొట్టెల

మూటను విప్పి తింటూండగా పక్కన పెట్టిన డబ్బు సంచీ గాలిలోకి ఎగరడం చూసి దిగ్భ్రాంతి చెందారు!

వాళ్ళు లబోదిబో మంటూ వేడుకుంటు న్నప్పటికీ, డబ్బు మూటను చేజిక్కించుకున్న దెయ్యాలు, ఇనుమడించిన ఉత్సాహంతో మూటను విప్పి నాణాలను ఎత్తుకు పోయి దాపులనున్న కొలనులో చెల్లాచెదరుగా చల్లేశాయి. రైతు దంపతుల ఏడుపును చూసి వికవికా నవ్వుతూ గెంతులు వేయసాగాయి.

ప్రాణాలకన్నా విలువైన డబ్బు గంగ పాలవడంతో తట్టుకోలేని రైతు దంపతులు కొలనులో దిగి డబ్బుకోసం నీటి అడుగున గాలించసాగారు. అతికష్టం మీద చాలా సేప టికి ఒకనాణెం తీయగలిగారు. ఆ తరవాత ఉన్నట్టుండి ఒక పెద్ద మూట దొరికింది. అందులో పదివేల వరహాలు ఉన్నాయి!

చాలా రోజుల క్రితం వెంటబడి తరుముకు వస్తూన్న భటులకు భయపడి ఒక దొంగ పడవేసిన డబ్బు మూట అది. పాము కాటు వల్ల వాడు చనిపోవడంతో ఆ డబ్బు మూట కొలనులోనే ఉండిపోయింది.

తమ కూతురి పెళ్ళిని మరింత వేడుకగా జరిపించాలన్న ఉత్సాహంతో రైతు దంప తులు అక్కడి నుంచి పరమానందంతో బయలుదేరారు.

ఆ దృశ్యం దెయ్యాలకు పట్టరాని దుఃఖం కలిగించడంతో పొగిలి పొగిలి యేడ్చాయి. ''ఆ గడ్డంసాధువు మంచిగానే మన మీద గెలుపు సాధించాడు. నావల్ల ఏ ఒక్కరికీ మేలు



జరగకూడదు,'' అంటూ గట్టిగా నిట్టూర్చింది తిరుపెమ్మ దెయ్యం.

''పోనీ, వ్యతిరేక ఫలితాల కోసం మంచి పనులు చేద్దామా?'' అని అడిగింది తిరుపాలు దెయ్యం.

''ఏమిటీ, మంచి పనులు చేయడమా? అది మనిషిగా ఉన్నప్పుడే చెయ్యలేదు. ఇప్పుడు నావల్ల అయ్యే పనికాదు,'' అంటూ విచారంగా మూలిగింది తిరుపెమ్మ దెయ్యం.

అయితే తిరుపాలు దెయ్యం మాత్రం సాధువు మాట ప్రభావాన్ని మరొకసారి పరీక్షిం చాలనుకున్నది.

అంతలో దూరంగా ఒక ఎద్దుల బండి రావడం కనిపించింది. ఆ బండిలో నిండు గర్భిణి ఉన్నది. ప్రసవం కష్టం కావడంతో ఆమెను గ్రామం నుంచి పట్నం వైద్యుడి

వద్దకు తీసుకువెళుతున్నారు. శ్వాసపీల్చు కోవడానికే ఆయాసపడుతూ ఆమె ప్రాణ గండంలో పడిపోయింది. బండిలోని ఆమె భర్త, బంధువులు బండిని వేగంగా తోలమని బండివాణ్ణి బతిమాలుతున్నారు.

బండి సత్రం దాపులకు రాగానే తిరుపాలు దెయ్యం వికృత చేష్టలతో కీచుమని అరుస్తూ ఎద్దులకు ఎదురుగా వెళ్ళింది. దెయ్యాన్ని చూడగానే ఎద్దులు బెదిరిపోయి చెరో దిక్కుకు లాగడంతో బండి బోర్లాపడి బండిలోని వాళ్ళందరూ చెల్లాచెదరయ్యారు. పెద్ద ప్రమాదం జరిగిపోయిందని అందరూ భయపడ్డారు. కానీ, విచిత్రంగా ఎవరికీ, ఏమీ జరగలేదు. పైగా బండిలోని గర్భిణి ఎగిరి దూరంగా పడ డంతో, ఆ కుదుపుకు ప్రసవం జరిగిపోయింది. తల్లీ బిడ్డా క్షేమం.

అనుకోకుండా అడ్డువచ్చి మేలు చేసినం దుకు దెయ్యానికి అందరూ కృతజ్ఞతలు చెప్పారు. మెచ్చుకున్నారు. వారి మాటలు దానికి సంతోషం కలిగించాయి. తరవాతి రెండు రోజులలో ఇలాంటివే మరి రెండు సంఘటనలు జరిగాయి. వాటి ద్వారా ఎదుటి వారిని పీడించడంకన్నా మేలు చేయడంలోనే గొప్ప ఆనందం ఉందని తిరుపాలు దెయ్యం గ్రహించింది. అయితే తిరుపెమ్మ దెయ్యం అలిగి, విడిపోతానని బెదిరించింది.

''బతికుండగా నీ మాట ఎప్పుడైనా కాద న్నానా? నీ మాట విని అందరినీ రకరకాలుగా బాధ పెట్టాను కదా? చచ్చాక కూడా దెయ్యమై ఇన్నాళ్ళు నువ్వు చెప్పినట్టే చేశాను కదా? ఇప్పుడు నువ్వు నా మాట కాస్త విను. ఎదుటి వాళ్ళకు జరిగే మంచి చూసి సంతోషించడం నేర్చుకో. స్వానుభవంతో చెబుతున్నాను. అది నీకూ, నాకే కాదు; అందరికీ మంచిది,'' అంటూ తిరుపాలు దెయ్యం మాయమై పోయింది.

తాము కీడు చేసినా ఎదుటివారికి మేలే జరిగి దాని ద్వారా జన్మవిముక్తి సిద్ధిస్తుందన్న సాధువు మాటలు గుర్తురావడంతో, తిరుపెమ్మ భర్తకు విముక్తి లభించిదని గ్రహించింది. ఆ తరవాత అక్కడ ఒంటరిగా ఉండలేక కీచు మని అరుస్తూ ఎటో ఎగిరివెళ్ళిపోయింది.



# చందమామ క్విజ్ - 8

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

Co-sponsored by
Infosys FOUNDATION, Bangalore

అన్నీ సరైన సమాధానాలు
రాసిన ఒకరికి బహుమతి
రూ. 250లు.*

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే ఒక్కొక్క విజేతకు 50 రూ.లు బహుమతిగా ఇవ్వబడుతుంది.

ఈ నెల ప్రశ్నలు భారతీయ కళలు, శిల్పాలకు సంబంధించినవి

మీరు చేయవలసిందేమంటే : 1. సమాధానాలు రాయండి. 2. మీ పేరు, వయసు (16 ఏళ్ళలోపు ఉండాలి) పిన్‌కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి. 3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి. 4. కవరు మీద చందమామ క్విజ్- 8 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి. 5. సెప్టెంబర్ నెలాఖరులోగా మీ ఎంట్రీ మాకు అందాలి. 6. నవంబర్ 2008 నెల సంచికలో ఫలితాలు వెలువడతాయి.



1. పహారి చిత్రకళ ఎక్కడ వర్ధిల్లింది?
2. పౌరాణిక పాత్రలను చిత్రీకరించడం ద్వారా ప్రసిద్ధి చెందిన దక్షిణ భారత చిత్రకారుడు ఎవరు?
3. రవీంద్రనాథ టాగూర్‌కు, అమృతా షేర్ గిల్‌కు మధ్య ఉన్న సామ్యం ఏమిటి?
4. 'నేషనల్ గ్యాలరీ ఆఫ్ మోడర్న్ ఆర్ట్' ఎక్కడ ఉన్నది? అది ఎప్పుడు స్థాపించబడింది?
5. సుప్రసిద్ధ 'త్రిమూర్తి' శిల్పం ఎక్కడ ఉన్నది?
6. మహాబలిపురంలోని తీర ఆలయాన్ని ఏ రాజవంశస్థులు నిర్మించారు?
7. 'చండీఘర్'ను రూపకల్పన చేసిన వారెవరు?
8. సుప్రసిద్ధ బులాండ్ దర్వాజా ఎక్కడ ఉన్నది? దానిని ఎవరు నిర్మించారు?

# వార్తలలో బాలలు

## మరో భారతీయుడి విజయం




ఈ సం. నేషనల్ జాగ్రఫిక్ బీ అవార్డ్-అమెరికాలోని నెబ్రాస్కా పబ్లిక్‌స్కూల్లో ఆరవ గ్రేడు విద్యార్థి పదకొండేళ్ళ అక్షయ్ రాజ గోపాల్ అందుకుంటున్నాడు. బహుమతి తెచ్చి పెట్టిన ప్రశ్న ''కొచబాంబా ఎక్కడ ఉన్నది?'' అక్షయ్, ''బొలీవియా,'' అని సమాధానం చెప్పాడు. అతనికి 25,000 అమెరికన్ డాలర్లు బహుమతి మొత్తంగా వచ్చింది. మే 21వ తేదీ వాషింగ్టన్‌లో ఈ పోటీ నిర్వహించబడింది. అక్షయ్ తల్లిదండ్రులు బెంగళూరు నుంచి అమెరికా వెళ్ళి స్థిరపడినవారు. నేషనల్ జాగ్రఫిక్ బీ కోసం ఆ కుర్రాడు చేసిన మొదటి ప్రయత్నం ఇది. భూగోళ శాస్త్రం పట్ల ఆసక్తి కనబరచే అక్షయ్‌కి అద్భుతమైన జ్ఞాపకశక్తి ఉన్నది. ఐదేళ్ళ ప్రాయంలోనే 190 దేశాల రాజధానుల పేర్లు సునాయాసంగా చెప్పగలిగేవాడు. అప్పుడు వాళ్ళ కుటుంబం మలేసియాలో ఉండేది.

## కొలంబో నుంచి తిరిగి వచ్చిన ఛాంపియన్

తమిళనాడు మారుమూల గ్రామం వడలూరుకు చెందిన వి. ఆనంద్ అనే పదకొండేళ్ళ విద్యార్థి ఇటీవల శ్రీలంక రాజధాని కొలంబోలో జరిగిన ఎస్ఐపి అబాకస్, బ్రెయిన్ జిమ్, గణితపోటీల్లో పాల్గొని ఈవెంట్ సెవెంత్ లెవల్లో ఛాంపియన్‌గా వచ్చాడు. నైవేలిలోని జవహర్ మెట్రిక్యులేషన్ హయ్యర్ సెకండరీ స్కూల్లో 7వ తరగతి చదువుతూన్న విజయ్ తెలివి తేటల్లో నగరాలలోని ధనిక వర్గాల నుంచి వచ్చిన విద్యార్థులకు దీటుగా ప్రతిభ కనబరచడం చెప్పుకోతగ్గ విశేషం!



చందమామ క్విజ్ -6 (జూలై '08) విజేతలకు అభినందనలు:

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఎంట్రీలు పాఠకుల నుంచి ఒక్కటీ రాలేదు.

అందువల్ల బహుమతి ఇవ్వలేక పోతున్నాం.

# యువరాజు ఆర్య సువర్ణద్వీప అన్వేషణ!

యువరాజు ఆర్య తమ పాలకుడు కావడంతో శాంతిపురి ప్రజలు అమితానందం చెందారు. అయితే, వాళ్ళు ఇప్పుడు కొన్ని కఠోర వాస్తవాలను ఎదుర్కోవలసి వచ్చింది. రాజ్యంలో వనరులన్నీ అడుగంటి పోయాయి. ఒకప్పుడు శాంతిపురిలో అంతర్భాగంగా ఉండి కనిపించకుండా పోయిన సువర్ణ ద్వీపాన్ని కనుగొని శాంతిపురి పూర్వ వైభవాన్ని పునరుద్ధరించడానికి యువరాజు ఆర్య బద్ధకంకణుడయ్యాడు. తమ పూర్వులైన శాంతిపురి రాజులు నిధి నిక్షేపాలను భద్రత కోసం సువర్ణ ద్వీపంలో దాచేవారని తెలియ రావడంతో అక్కడి సంపదలను తెచ్చి ప్రజల సంక్షేమానికి వినియోగించాలని యువరాజు ఆర్య నిర్ణయించాడు. ఉద్విగ్న భరితమైన సువర్ణద్వీప అన్వేషణ ప్రయాణంలో యువరాజు ఆర్య ప్రతికూల ప్రకృతి శక్తులనే కాకుండా భయంకరమానవులనూ, భయానక భూతాలనూ ఎదుర్కోవలసివచ్చింది. 2008 అక్టోబర్ సంచిక నుంచి అవి ఒక్కొక్కటిగా ఆవిష్కృతమవుతాయి!

ఉద్విగ్నభరిత అజ్ఞాత యువరాజు ఆర్య కామిక్స్ రెండవ భాగం అక్టోబర్ సంచికలో ఆరంభం!

# ఫోటో వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని
వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.



B. HARSHAVARDHANA



B. HARSHAVARDHANA



వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా
మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు నవంబర్ 2008 సంచికలో ప్రచురిస్తాం.
ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.
ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, జెవిఎల్ ప్లాజా 6వ అంతస్తు, 626, అన్నాసాలై,
తేనాంపేట, చెన్నయ్ - 600 018

## అభినందనలు

జూలై నెల పోటీ ఫలితాలు
వరగాని. ఓరుగల్లు
ఎన్.జీ.ఓ. కాలనీ, మొదటి ఇల్లు,
వెంకటేశ్వర స్వామి గుడి ఎదురు,
నరసరావు పేట - 522 601
గుంటూరు జిల్లా (ఆం.ప్ర.)

ఫోటో వ్యాఖ్యల పోటీ:





మొదటి ఫోటో: ఎందరి శ్రమ ఫలమో
ఈ సుందర శిల్పారామం!
రెండవ ఫోటో : ఎందరి త్యాగఫలమో
ఈ త్రివర్ణపతాకం!!

## సమాధానాలు :

1. సూర్యుడు 2. సాందీపుడు 3. శివుడు 4. అహల్య, ద్రౌపది, సీత, తార, మండోదరి
5. పతంజలి 6. అశ్వినీ దేవతలు 7. శంఖం, చక్రం, గద, పద్మం 8. సూర్యుడు

Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 26 on behalf of Chandamama India Limited, JVL Plaza, 6th Floor, 626 (Old 501), Anna Salai, Teynampet, Chennai - 600 018. Editor : B. Viswanatha Reddi (Viswam)

